LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 49 | 8.12.2000 | శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



డి.ఆర్. ఉత్తమలో విందుల పసందు

- ప్రతి సోమ, గురు, శనివారాల్లో వివిధ రకాల శాకాహార రుచుల సమ్మేళనంతో బఫే డిన్నర్ - 7.30 నుంచి 10.30 గంటల వరకు కేవలం 99 రూపాయలకే.
- ప్రతిరోజూ వెజ్, నాన్‌వెజ్ ఐటమ్స్‌తో బఫే డిన్నర్ మరియు లంచ్.
- రాత్రి 11.30 గంటల తర్వాత మిడ్‌నైట్ బిర్యానీ, సాఫ్ట్‌డ్రింక్స్ మరియు ఐస్‌క్రీమ్‌తో - కేవలం 85 రూపాయలకే.

టేబుల్‌ను ముందుగానే రిజర్వ్ చేసుకోండి.

Phones : 317777 - 10 Lines

# రైతుల ఉసురు తగిలి తీరుతుంది

రాష్ట్రంలో రైతుల పరిస్థితి రోజు రోజుకు దిగజారి పోతున్నది. భవిష్యత్తు అంధకారంగా కన్పిస్తున్నది. వడ్లు కొనే దిక్కు లేదు. ఇతర పంటలదీ అదే దుర్గతి. ముప్పాతిక రాష్ట్రం కరువు బారిన పడి వుంది. నీళ్లు లేక, కరెంట్ లేక పంటలు నిలువునా ఎండి పోతున్నాయి. ప్రభుత్వం వైపు నుంచి ఎటువంటి సహాయం, సహకారం అందడం లేదు. మొసలి కన్నీళ్లు కార్చడం తప్ప రైతుల కష్టాలు తీర్చడానికి ప్రభుత్వ నేతలు చిత్త శుద్ధితో ప్రయత్నం చేయడం లేదు.

ఎఫ్‌సిఐ చేత ధాన్యం కొనిపించడం ముఖ్యమంత్రికి అలివి కాలేదు. ఆయన ఎన్ని పత్రికా ప్రకటనలు ఇచ్చినా, ప్రధాన మంత్రికి ఎన్ని లేఖలు వ్రాసినా సమాధానమే లేదు. ఎఫ్‌సిఐ ముందుకు వచ్చి, రైతులకు మద్దతు ధర ఇచ్చి మొత్తం ధాన్యం కొనుగోలు చేస్తే కొంతలో, కొంత వరకు మేలు జరుగుతుంది. కాని ఎఫ్‌సిఐ దగ్గర ఇప్పటికే గత సీజన్లో కొన్న ధాన్యం నిలువలు మూలుగుతున్నాయి. వాటిని ప్రక్క రాష్ట్రాలకు తరలించి, గోడౌన్లు ఖాళీ చేస్తే తప్ప వారు కొత్తగా ధాన్యం కొనలేరు. కొంటే నిలవ చేయడానికి స్థలం లేదు. ముఖ్యమంత్రి కేంద్ర ప్రభుత్వంపై వొత్తిడి తెచ్చి, అత్యవసర పరిస్థితి క్రింద ధాన్యం తరలింపు, కొనుగోలు చేపట్టేటట్లు చేసివుండవచ్చు. కాని ఆయన కేవలం మొసలి కన్నీళ్లు కార్చి సరిపెడుతున్నాడు. ఇంజనీరింగ్ కాలేజీలు ఆలస్యంగా తెరవడానికి అనుమతి ఇప్పించడం కోసం ఢిల్లీకి వెళ్లి, సంబంధిత మంత్రులను దబాయించి మరీ ఆర్డర్ కాగితం చేత పట్టుకుని వచ్చిన చంద్రబాబు నాయుడు, కొన్ని కోట్ల మంది రైతుల బ్రతుకులకు సంబంధించిన ఈ సంక్లిష్ట సమస్యపై మాత్రం ప్రధాన మంత్రికి జాబు వ్రాసి సరిపెట్టుకున్నాడు. ఆయనలో ఏ మాత్రం చిత్తశుద్ధి వున్నా, ఢిల్లీ వెళ్లి, వ్యవసాయ మంత్రిని వొత్తిడి చేస్తే, ఎఫ్‌సిఐ మాట వినకుండా పోయేది వుండదు. కాని ఇందుకోసం ఢిల్లీకి వెళ్లడానికి ఆయనకు తీరిక దొరకడం లేదు. తెలుగు దేశం ఎమ్పీలు ప్రధాన మంత్రిని కలిస్తే, ఇది అంత పెద్ద సమస్య కాదు అని తీసిప్రక్కన పారేశాడు వాజ్‌పాయి.

ఇంకొక ప్రక్క కరెంట్ సరఫరా విషయంలో రాష్ట్ర ప్రభుత్వం పచ్చి మోసానికి పాల్పడుతున్నది. కాంగ్రెస్ నేత కొణిజేటి రోశయ్య జిల్లాల వారీగా పర్యటిస్తూ, గ్రామాలకు వెళ్లి రైతులను పలకరిస్తు, వాస్తవ పరిస్థితులను వెల్లడి చేస్తున్నారు. కొన్ని వందల గ్రామాలలో నీళ్లు లేక ఎండి పోయిన పైర్లను పత్రికల వారికి చూపించారాయన. రైతుల హృదయవిదారక గాథలు విన్పించారు. పొలాలలో పశువులు మేస్తున్న దృశ్యాలు పత్రికలు ఫోటోలు తీసి ప్రచురించాయి.ఈ దారుణ పరిస్థితికి కారణం కరెంట్ సరఫరా సరిగా లేక పోవడం అని ప్రతి రైతు నెత్తినోరు బాదుకుని మరీ చెప్తున్నాడు. కాని ప్రభుత్వంలో చలనం లేదు. గత ఏడాది అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా, పోలింగ్ ముగిసే వరకు, ఒక్క రోజు కూడా ఒక్క గంట కూడా కరెంట్ సరఫరాలో అంతరాయం లేకుండా చూసిన ముఖ్యమంత్రి ఇప్పుడు ఏ ఎన్నికలు లేకపోవడంతో రైతుల మొర

తరువ 7వ పేజీలో

## కొత్త డి.జి.పి.-రాములు?

రాష్ట్ర పోలీసు డైరక్టర్ జనరల్‌గా పి.రాములు గారిని నియమించాలని ముఖ్యమంత్రి నిర్ణయించినట్లు అనధికార వార్త, ఇప్పటి డిజిపి దొరకు, చంద్రబాబుకు పెద్దగా సయోధ్య లేదు. తనను వదిలేస్తే కేంద్ర సర్వీసులకు వెళ్లిపోతానని చాలా కాలం నుంచి కోరుతున్నాడు - దొర. కాని ఎప్పటికప్పుడు ఏదో ఒక అవాంతరం వస్తుండడంతో ఆ పని వాయిదా పడుతు వస్తున్నది; ఇప్పుడు నిర్ణయం జరిగిపోయింది.

ముఖ్యమంత్రి రాములు గారిని పిలిపించి, మీకు వున్న ఒకే ఒక అనర్థత మీ త్రాగుడు వ్యసనం; దాన్ని మానుకోవడానికి రెండు నెలల సమయం ఇస్తున్నాను; మీలో మార్పు వచ్చింది అన్న నమ్మకం కలిగితే, కొత్త డిజిపిగా మిమ్మల్ని నియమిస్తాను - అనిచెప్పాడట. అప్పటినుంచి రాములు గారు టీ టోట్లర్‌గా మారిపోయారు. బహుశా ఒకటి రెండు వారాలలోనే ఆయన డిజిపిగా పదవి స్వీకరించవచ్చు.

రాములుగారు మంచి పోలీసు అధికారి. నిష్పాక్షపట్యం, నిజాయితి ఆయనలోని సులక్షణాలు. స్నేహితుల విషయంలో కొన్ని బలహీనతలు న్నప్పటికి, తన పదవి నిర్వహణలో ఎప్పుడు చెడ్డపేరు తెచ్చుకోలేదు. ఏ పని అప్పచెప్పినా సమర్థవంతంగా నిర్వహించేస్తాడన్న మంచి పేరు వుంది. ఎసిబి డైరక్టర్ జనరల్‌గా కూడా ఆయన సంచలనం సృష్టించారు. ముఖ్యమంత్రి పగ్గాలు పట్టి వెనక్కు లాగబట్టి సరిపోయింది కాని, రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులో వున్న పలువురు ఐఎఎస్, ఐపిఎస్ అధికార్ల అవినీతి బయట పెట్టడానికి ఆయన పకడ్బందీ వ్యూహం పన్ని వుండినాడు. ప్రభుత్వ పరంగా సహకారం లేకపోవడంతో ఆయన నివేదికలు ఫైళ్ల క్రింద పడి, దుమ్ము కొట్టుకొని పోయాయి.

రాములు డిజిపి అయితే పోలీసు యంత్రాంగంలో కొత్త మార్పులు తెస్తాడని ఆశించవచ్చు. *

## వెండితెరపై చంద్రమాయ - "మాబాబు"

ప్రజల కళ్ల ముందు మాయా ప్రపంచం సృష్టించడంలో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ముందు ఎంత పెద్ద ఇంద్రజాలికుడైనా దిగదుడుపే! తాజమహల్‌ను రెండు నిముషాల పాటు మాయం చేసిన సర్కార్ అయినా; గాలి నుంచి బూడిద సృష్టించే సత్యసాయి బాబా అయినా చంద్రబాబు దగ్గర పాఠాలు నేర్చుకుని తీరవల్సిందే. జన వశీకరణ విద్యలో ఆయన అంతగా ఆరి తేరిపోయాడు; నిష్ణాతుడైనాడు. సమాజంలోని ఒక వర్గం ప్రజల్లో తన పట్ల ప్రగాఢమైన సదభిప్రాయం కల్పించుకొన్నాడాయన ఈ విద్యతో. అందుకోసం ఇంత కాలం దినపత్రికలను, టెలివిజన్ వార్తలను సాధనాలుగా వాడుకొన్నాడు. తెలుగు పత్రికా యాజమాన్యాలు చంద్రబాబు ఇమేజ్ పెంచడానికి చేసిన కృషి అంతా ఇంతా కాదు. ఆయన నిలబడినా, కూర్చున్నా, మాట్లాడినా, నడిచినా, దగ్గినా, తుమ్మినా అది ప్రజల మేలు కోసమే అన్నట్లు ప్రచారం చేశాయి దినపత్రికలు. ఆయన తప్పులు బయట పడకుండా పాతాళానికి తొక్కి పారేశాయి. అయితే ఎంత తెలివైన మోసమైనా ఎల్లకాలం ప్రజల కళ్లు కప్పలేరు కదా? పత్రికా వార్తలు, కథనాలు ప్రజలను నమ్మించాలనే పరిస్థితి ఏర్పడుతున్నదన్న నిజం గ్రహించి, ఇప్పుడు కొత్తపద్ధతిలో అదే ప్రజలను మరొకసారి మాయలో ముంచెత్తడానికి సినిమా రంగంవైపు దృష్టి సారిస్తున్నాడు చంద్రబాబు.

కరెంట్ ఛార్జీల పెంపకంపై ప్రతిపక్షాలు వుద్యమం నడిపినప్పటి నుంచి జనంలో తన ఇమేజ్ తగ్గిందన్న సందేహం పీడిస్తున్నది ముఖ్యమంత్రిని. గోరు చుట్టు మీద రోకటి పోటు వలె కరెంట్ కొరత ఆయన్ను బాధిస్తున్నది. గిట్టుబాటు ధరలు లేక రైతాంగంలో రాజుకుంటున్న ఆగ్రహం మరింతగా భయపెడుతున్నది. ప్రతిపక్ష నేతలు పనిగట్టుకొని ప్రభుత్వ వైఫల్యాలను ప్రచారం చేస్తున్నారు. తన అంతేవాసి పత్రికలు కూడా దాన్ని కప్పి పెట్టలేక పోతున్నాయి. జనంలో ప్రభుత్వ సమర్థతపైన, ముఖ్యమంత్రి చిత్తశుద్ధిపట్ల అనుమానాలు, వ్యతిరేక అభిప్రాయాలు

తరువ 12వ పేజీలో

## గొంతులో వెలక్కాయ

అయోధ్యలో రామాలయ నిర్మాణం జాతి అభీష్టం అని ప్రధాన మంత్రి చేసిన వ్యాఖ్య తెలుగుదేశం పార్టీకి గొంతులో పచ్చి వెలక్కాయ వలె పడింది. బిజెపి ప్రభుత్వం ముస్లింల ప్రయోజనాలకు వ్యతిరేకంగా పని చేస్తున్నదన్న అనుమానం కలిగిన ప్రక్షణం దానికి తమ మద్దతు వుపసంహరిస్తామని పలుమార్లు చెప్పారు తెలుగునేతలు. తాము ఎన్‌డిఎ ప్రభుత్వంలో భాగస్వామ్యులుగా వున్నంత కాలం అయోధ్య వంటి సున్నిత అంశాలలో వాజ్‌పాయి తప్పుచేయ లేడని డంబంగా పలుకుతుండినారు వారు. ఇప్పుడు అదే వాజ్‌పాయి అంత పచ్చిగా రామాలయ నిర్మాణాన్ని సమర్థించడంతో తెలుగు దేశం పార్టీకి పెద్ద సంకటం ఎదురౌ తున్నది. కేంద్ర ప్రభుత్వం నుంచి దూరమయ్యే పరిస్థితి ఇప్పటిలో లేదు; అట్లని కల్సి వుంటే ముస్లింలలో తమ పట్ల వ్యతిరేకత ఏర్పడుతుందని భయం. వాజ్‌పాయిని విమర్శించలేరు; సమర్థించనూ లేరు. పెద్ద చిక్కే పాపం. •



డా|| B.V.S. రవిశంకర్

M.B.B.S., D.Diab (Europe)

నూతన ప్రారంభం 10.12.2000 తేది ఉదయం 10.40 గం.లకు

రవి డయాబిటీస్ రీసెర్చ్ సెంటర్

రాఘవసినీ కాంప్లెక్స్ దగ్గర, పొగతోట, నెల్లూరు

మద్రాసు అపోలో హాస్పిటల్స్ నందు తన సేవలందించి, క్రొయేషియా (యూరోప్)లో మధుమేహవ్యాధి నందు పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసి డయాబిటిస్ రెటీనోపతి నందు పేపర్ సమర్పించి, డయాబిటిక్ ఫుట్‌కేర్ ట్రీట్‌మెంట్ నందు మెళకువలు పొంది, నెల్లూరులో అధునాతన కంప్యూటరైజ్డ్ వైద్య సౌకర్యములతో

డా|| B.V.S. రవిశంకర్

రవి డయాబిటిస్ రీసెర్చి సెంటర్

ప్రారంభిస్తున్న శుభసందర్భంలో

ముఖ్య అతిథులకు, శ్రేయోభిలాషులకు, మిత్రులకు మా హృదయపూర్వక ఆహ్వానం.

| ప్రారంభకులు | కన్సల్టేషన్ ఛాంబర్ ప్రారంభకులు | కంప్యూటరైజ్డ్ డయాగ్నస్టిక్ సెంటర్ ప్రారంభకులు |
|---|---|---|
| డా. D. శాంతారామ్ M.D., Diab., Asst. Professor, Diabetology - Chennai Medical College | శ్రీ ఆనం వివేకానందరెడ్డి నెల్లూరు శాసన సభ్యులు | శ్రీ టి. ఆంజనేయులు డిస్ట్రిక్ట్ సెషన్స్ జడ్జి |

ECG & మైనర్ ఆపరేషన్ థియేటర్ ప్రారంభకులు : శ్రీ కె. శ్రీనివాసరెడ్డి, సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు

B.R. Ads, Ph. 336614



ఉదయగిరిలో మేకపాటి రాజమోహన్‌రెడ్డి చారిటబుల్ ట్రస్ట్ సైన్స్ అండ్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్ భవనాల నిర్మాణానికి భూమిపూజ చేస్తున్న ఆ ట్రస్టు కోశాధికారి మేకపాటి చంద్రశేఖర్ రెడ్డి.

# మామ-అల్లుళ్ల పునర్వివాహం!

జిల్లా తెలుగు దేశంలో కొత్త కొత్త మార్పులు. వింత వింత మలుపులు తటస్థిస్తున్నాయి. గత ఏడాది కాలంగా స్తబ్దంగా వుండిన రాజకీయం రంజుగా తయారౌతున్నది. అసెంబ్లీ ఎన్నికల తర్వాత జిల్లా మంత్రిత్వం ఆదాల ప్రభాకరరెడ్డికి ఇచ్చి చాలా తెలివైన పని చేశారు చంద్రబాబు నాయుడు. ప్రభాకర రెడ్డికి ఎవరితోనూ బంధం లేదు. విభేదా



లులేవు. ఒక రకంగా తటస్థుడిగా రంగప్రవేశం చేశారు ఆ రోజు. రాజకీయాలకు కొత్త వారు కావడం, అప్పటి వరకు ఆయన్ను అందరు బంగారు పిచ్చుకగా పరిగణించి వాడుకోవడం, సహజంగా వివాదాల జోలికిపోని తత్వం కావడం ప్రభాకరరెడ్డికి కల్సి వచ్చింది. కాని ఇప్పుడా పరిస్థితి లేదు.

మంత్రిత్వం రాలేదన్న అలుకతో, ఆగ్రహంతో 15 నెలల పాటు తనలో తాను కుమిలి పోయిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి జూలు విదల్చి, చెవులు టప టప లాడించి గోదాలోకి దిగాడు. చంద్రమోహన్‌రెడ్డిది ఒక విశిష్ట రాజకీయ శైలి. తగువెట్లా వస్తుంది అంటే, బిచ్చం పెట్టవే బొమ్మముంటా అనే రకం. ఎప్పుడూ ఏదో ఒక వివాదం వుండనిదే నిద్ర పట్టదు; తిండి సగించదు. ఈ సుగుణాలు ఇన్ని నెలల పాటు తనలోనే బిగపట్టి వుంచుకోగల్గడమే విచిత్రం. ఇప్పుడవి సీసాలోంచి అల్లావుద్దీన్ భూతం బయటకు వచ్చినట్లు వచ్చేశాయి. తేనెటీగల తుట్టె కదిలించినంత వరకే ప్రశాంతత; అది కదిలిన తర్వాత చెవులు గింగురుమనే ఈగల మోత వినక తప్పదు కదా?

కందిరీగల పుట్టలో వేలు పెట్టింది చెన్నారెడ్డి పెంచలరెడ్డి కావడం విశేషం. అందరికీ మంచిగా వుండాలని వంగి వంగి దండాలు పెట్టే పెంచలరెడ్డి ఇద్దరి మధ్య విరోధానికి కారకుడు కావడం కంటే ఆశ్చర్యం మరొకటి వుండదు. పెంచలరెడ్డి పార్టీ ప్రవేశం సాకుగా మంత్రి ప్రభాకరరెడ్డి మీద యుద్ధభేరి మోగించాడు చంద్రమోహన్. ఈ చేరికతో ధూపం తెగదని నాకు బాగా తెల్సు, కాని దీన్ని వదిలేస్తే రేపు ఇంకా పెద్ద సమస్యలు తెచ్చి నెత్తిన రుద్దేస్తారు కాబట్టి, చిన్న పాముని పెద్దకర్రతో కొడుతున్నాను - అంటున్నాడు చంద్రమోహన్‌రెడ్డి. పార్టీలో చేరిన పెంచలరెడ్డిని ఎట్లయినా సరే విసిరి బయట పారేస్తే జిల్లాలో తన పలుకుబడి పెరిగిపోతుంది అన్నది ఆయన ఆశ. అందుకు ఒకటికి మూడు సార్లు ముఖ్యమంత్రిని కలిసి, మంత్రి మీద దావా దాఖలు చేశాడు. కాని చంద్రబాబు మహా కంత్రి కదా - ఎవరు వస్తే వారికి నగించినట్లు మాటలు చెప్పి సాగనంపుతున్నాడు. చంద్రమోహన్‌కు హామీ ఇచ్చాడట ఆయన - పెంచలరెడ్డి సభ్యత్వం రద్దు చేస్తానని; పొలిట్‌బ్యూరోలో దీనిపై చర్చ జరిపిస్తానని కూడా మాట ఇచ్చాడట. ముఖ్యమంత్రి అంతటి వాడు మాట చెప్పిన తర్వాత ఇంక తిరుగువుండదు అన్న నమ్మకంతో ఆనందంగా తెరిగి వచ్చాడు చంద్రమోహన్.

కాని అది జరిగి రెండు వారాలు గడిచిపోయినా అక్కడి నుంచి సందేశం



ఏదీ రాలేదు. ప్రభాకరరెడ్డి కూడా సిఎంని కల్సి తన వాదం విన్పించినట్లున్నాడు. పెంచలరెడ్డిని చేర్చుకున్నది నెల్లూరు నియోజక వర్గం నుంచే తప్ప సర్వేపల్లి నుంచి కాదని, ఇప్పుడు పెంచలరెడ్డికి సర్వేపల్లితో ఎటువంటి సంబంధాలు లేవని మంత్రి వివరించి వచ్చినట్లున్నాడు. ఆయనకు ఏమి హామీలు ఇచ్చాడో, మాటలు చెప్పాడో - ముఖ్యమంత్రి మనకైతే తెలియదు.

నిజంగా చంద్రబాబు మనసుకు ఈ వివాదం పట్టి వుంటే, చంద్రమోహన్ రెడ్డికి ఇచ్చిన మాట నిజమే అయితే సభ్యత్వం రద్దు ప్రకటన వెలువడాలి కదా అన్నది మంత్రి వర్గం వాదన. దీనికి చంద్రమోహన్ దగ్గర సమాధానం లేదు. అయితే "నాకు నమ్మకంగా తెల్సిన సమాచారం ప్రకారం ప్రభాకరరెడ్డిని పిలిపించి చీవాట్లు పెట్టి పంపాడు ముఖ్యమంత్రి" అని చెప్తున్నాడాయన.

నీరు పల్లమెరుగు, నిజం దేవుడెరుగు!

ఇదిట్లా వుంటే, నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి గారు వున్నట్లుండి గోడ దూకేశాడు. అసెంబ్లీ ఎన్నికల సమయంలో తన కోవూరు కంటే తన మామ పోటీ చేసే సర్వేపల్లి మీదనే అధిక శ్రద్ధ చూపించాడు ప్రసన్న. తాత పోతే బొంతనాది అన్నట్లు, చంద్రమోహన్ ఎమ్మెల్యేగా ఓడిపోతే మంత్రి పదవి తనది అవుతుంది అన్నది అప్పటిలో ఆయన ఆశ. అది జరగకపోయేసరికి, ఎన్నికలు కాగానే ఆదాల భుజం ఎక్కి కూర్చున్నాడు. ఈ ఏడాదిన్నర కాలంలో చంద్రమోహన్ మీద అదే పనిగా చాడీలు చెప్తూ, ఎట్టి పరిస్థితులలో ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్ ఒకటి కాకుండా జాగ్రత్తపడుతూ వచ్చాడు. ఎప్పటికైనా మంత్రికంటే, తన మామ ప్రమాదకారి అన్నది ప్రసన్నకుమార రెడ్డి ప్రగాఢ నమ్మకం.

కాని గత రెండు వారాలుగా ప్రసన్నలో చాలా మార్పు వచ్చింది. చంద్రమోహన్ రెడ్డితో కలయికకు తహ తహ లాడుతున్నాడు ప్రసన్న. ఎప్పుడో స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి బ్రతికి వుండేటప్పుడు వీరిద్దరు కల్సి వుండే వారు; ఆ తర్వాత రాజకీయంగా

తరువాయి 6వ పేజీలో

- జిల్లా తెలుగుదేశంలో వసందు పరిణామాలు.
- నిన్నటి వరకు మంత్రి ముక్కుపిండి జేబులు నింపుకొన్నాడు - రేపటి నుంచి మంత్రి ముక్కుపట్టి ఆడించాలని చూస్తున్నాడు.
- రమేష్‌రెడ్డి పరిస్థితి ఇక నుంచి కల్లు త్రాగిన కోతి చందమే.
- ప్రభాకర్ రెడ్డిలో మాత్రం షరామామూలుగా వులుకులేదు, పలుకు లేదు.
- పెంచలరెడ్డి సభ్యత్వమే ప్రథమ పోటీ పరీక్ష


## కృతజ్ఞతలు

## డా. జి. అశోక్

State President, I.M.A.

నన్ను ఇంత చిన్న వయస్సులోనే ఐ.యం.ఏ. స్టేట్ ప్రెసిడెంటుగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్న సహాధ్యర్లకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు, నాకు మీరందించిన ఈ సహకారానికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇక ముందు కూడా ఇదేవిధంగా అందించాలని కోరుకుంటూ...

మీ... అశోక్


# సిడబ్ల్యుసిపై ఆశజాస్తి- అవకాశాలు తక్కువ!

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి ఎన్నిక తప్పదని తేలి పోవడంతో రాష్ట్ర కాంగ్రెస్ పెద్దలకు కాళ్లు చేతులు ఆడడం లేదు. ఈ నెలాఖరు లోపల ఎన్నిక జరిగిపోయేటట్లు వుంది. ఏఐసిసి సభ్యులందరు సిడబ్ల్యుసి ఎన్నికలో ఓటర్లు. దేశం మొత్తం మీద 1200 ఓట్లు వుంటాయి. మన రాష్ట్రం నుంచి 80 మంది వరకు ఏఐసిసి సభ్యులు వుంటారు. కనీసం 500 మంది ఏఐసిసి సభ్యుల మద్దతు పొందగల్గిన వారికి మాత్రమే గెలుపు అవకాశం.

కేవలం ఆంధ్ర ఓటర్ల మీద ఆధారపడితే పోటీ చేయడం దండగ. కనీసం ఆరేడు రాష్ట్రాల నేతలను సమీకరించుకోగల్గితేనే ఫలితం వుంటుంది. అందులోనూ ఉత్తరప్రదేశ్, బీహార్ రాష్ట్రాల నుంచి వచ్చే ఏఐసిసి సభ్యుల సంఖ్య అధికం కాబట్టి వారి మద్దతు తప్పనిసరి. జాతీయ స్థాయిలో, ఇతర రాష్ట్ర నేతలను కల్పుకుని ఎన్నిక రాజకీయం చేయడం అంత సులభ సాధ్యం కాదు. సోనియా గాంధీకి సన్నిహితులైన వారు మాత్రమే అది సాధించగల్గుతారు. అయితే సోనియా గాంధీ ప్రత్యేకంగా ఎవరి పేరును ప్రస్తావించే పరిస్థితి కన్పించడం లేదు.

ఇంకొక ప్రక్క సిడబ్ల్యుసిలో జనరల్ స్థానాల సంఖ్య తగ్గిపోయింది. మహిళలు, ఎస్సి., బిసి, మైనార్టీలకు కేటాయింపులు పోను కేవలం నాలుగు లేదా ఐదు స్థానాలు మాత్రమే తతిమా వారికి మిగులుతున్నాయి. ఈ పరిస్థితిలో జాతీయ పలుకుబడి కల్గిన అర్జున్ సింగ్, ఎన్‌డి. తివారి, మాధవరావు సింధియా వంటి వారు తమకు పోను మరొకరికి అవకాశం ఇచ్చే పరిస్థితి లేదు. ఎవరి సంగతి వారు చూసుకోవల్సిన పరిస్థితి. దేశం మొత్తం మీద పరిచయాలు, పలుకుబడి కల్గిన అటువంటి నేతలు ఆంధ్ర నుంచి ఎవరూ లేరు. కోట్ల విజయ భాస్కరరెడ్డి చాలా కాలం సిడబ్ల్యుసి సభ్యుడుగా, క్రమశిక్షణా సంఘ అధ్యక్షుడుగా వుండినప్పటికి, ఆయన ఎప్పుడు హైదరాబాదు, కర్నూలుదాటి పలుకుబడి పెంచుకోలేదు. పి.వి.నరసింహారావు గారి పుణ్యమా అని ఢిల్లీలో కొంత కాలం ఒక వెలుగు వెల్గినారాయన. ఇప్పుడు అటువంటి గాడ్ ఫాదర్లు ఎవరూ లేరు. ఆయన తర్వాత కొంత వరకు దేశ వ్యాప్త పరిచయాలు కల్గిన నేత ఎస్.జనార్ధనరెడ్డి గారు ఒక్కరే. అయితే ఆ పరిచయాలు ఎన్నికకు ఎంత వరకు పనికి వస్తాయన్న విషయం వేచి చూడవల్సిందే. సిఎల్‌పి నేత డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి గారికి జార్జి దగ్గర సాన్నిహిత్యం వుంది. అదేమైనా పనికి వస్తుందేమో చూడాలి. రాజేష్ పైలట్ మరణం ఆయనకు ఇప్పుడు పెద్ద కొరత. వీరి తర్వాత దేశమంతటా తెల్సిన వ్యక్తి తిక్కవరపు సుబ్బరామరెడ్డి. ఎమ్పీగా వుండిన కొద్దికాలంలోనే ఆయన అన్ని రాష్ట్రాల కాంగ్రెస్ వాదులతో సంబంధాలు పెంచుకున్నాడు. గతంలో జరిగిన కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఎన్నికలలో కార్యదర్శి పదవికి పోటీ చేసి గెలుపొందాడు. అయితే దానికి, సిడబ్ల్యుసికి చాలా తేడా వుంది.

## సిడబ్ల్యుసికి ఎన్నికయ్యే ఛరిష్మా గల ఆంధ్ర కాంగ్రెస్ నేతలెవరో?

వీరు కాక జి.వెంకటస్వామి, శివశంకర్లు సైతం సిడబ్ల్యుసి మీద కోరిక పెంచుకుని వున్నారు. కాని వారి ప్రయత్నం ఫలించే అవకాశమే లేదు.

ఎన్నికలో వీలు కాకపోయినా, సోనియాగాంధీ నామినేట్ చేసే జాబితాలోనైనా తమ పేరు చూసుకోవాలన్నది వీరిలో కొందరి ప్రయత్నం. కాని ఆమె ఆ జాబితాలో కూడా 33శాతం మహిళలకు కేటాయిస్తుందని చెప్తున్నారు. అంటె అక్కడా అవకాశాలు తరిగి పోతున్నాయన్న మాట.

ఇదిట్లా వుంటె రాష్ట్రం నుంచి ఎంపికయ్యే ఏఐసిసి సభ్యుల పేర్లు ఇంకా ఖరారు కాలేదు. పిసిసి అధ్యక్షుడు,

తరువాయి 7వ పేజీలో

# ఇంజనీరింగ్ కాలేజీల పందారం!

తిరునాళ్లలో పులిహోర పంచిపెట్టినట్లు, తన వారు అనుకున్న వారందరికి ఇంజనీరింగ్ కాలేజీలు పందారం చేశారు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు. రాష్ట్ర చరిత్రలోనే కాదు, దేశంలో ఎప్పుడు, ఏ ప్రభుత్వం కూడా సాహసించని రీతిలో, ఒకే ఒక్క సంతకంతో 130 కొత్త కాలేజీలకు అనుమతి మంజూరు చేశాడాయన. అందులో 60 చిల్లర కాలేజీలను ఈ విద్యా సంవత్సరం నుంచే ప్రారంభించడానికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశారు. డిసెంబర్‌లో కాలేజి ప్రారంభించడానికి అనుమతి ఇస్తే, వారు ఎప్పుడు అడ్మిషన్లు చేయాలి; ఎప్పుడు అయ్యవార్లను నియమించుకోవాలి; కుర్చీలు, బల్లలు ఎప్పుడు కొనాలి? ఇవన్నీ జరిగేటప్పటికి విద్యా సంవత్సరం కాస్తా అయిపోతుంది. అంటే వీటిలో చేరే పిల్లలు, మొదటి సంవత్సరం చదవకుండానే నేరుగా రెండవ ఏడాదిలోకి వెళ్లిపోతారన్నమాట.

చంద్రబాబు ముఖ్యమంత్రి అయిన తర్వాత గత ఆరేళ్లలో 61 ఇంజనీరింగ్ కాలేజీలు తెరిచారు. ఇప్పుడు మంజూరు అయినవి వీటికి అదనం. ప్రతి రెవిన్యూ డివిజన్‌కు ఒక ఇంజనీరింగ్ కాలేజి వుండాలన్న నిబంధన పెట్టి, ఆ సాకుతో ఇంత విచ్చలవిడి అనుమతులు ఇస్తున్నది ప్రభుత్వం. రాష్ట్రంలో మొత్తం రెవిన్యూ డివిజన్ల సంఖ్య 76 మాత్రమే. కాని ఇప్పటికే మంజూరైన కాలేజీల సంఖ్య 130 కి దాటి పోయింది; పై ఏడాది మరొక 60 చిల్లర ప్రారంభం అవుతాయి. ఇది అంతం కూడా కాదు; రేపు మార్చి తర్వాత మరికొందరు అడిగితే వారికి కూడా అనుమతి ఇవ్వరన్న గ్యారంటీ లేదు. వున్న కాలేజీల్లో సీట్ల సంఖ్యను సైతం పెంచారు. దాదాపు 45 వేల మందికి ఇంజనీరింగ్ చదువు లభ్యమవుతుంది ఇప్పుడు మన రాష్ట్రంలో.

ఉన్నత విద్య అభ్యసించాలనుకునే యువతీయువకులందరికీ అవకాశం కల్పించడానికి విద్యాలయాలు తెరవడంలో తప్పులేదు. కాని వాటికి కొన్ని నియమాలు, ఒక క్రమ పద్ధతి వుండాలి. ఎలిమెంటరీ స్కూళ్ల వలె వృత్తి విద్యాసంస్థలను తెరుచుకుంటూపోతే విద్యార్థులకు నష్టమే తప్ప లాభం జరగదు. ఇప్పటికే రాష్ట్రంలోని ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీలలో అర్హత కల్గిన అయ్యవార్లు, లాబొరేటరీలు వంటి వసతులు, చాలినన్ని తరగతి గదులు లేవని అలజడిగా వుంది. కేంద్ర సాంకేతిక విద్యామండలి కొన్ని కాలేజీల నిర్వహణ పట్ల తీవ్ర అభ్యంతరం చెప్పింది. కొన్నిటిలో సీట్ల సంఖ్య తగ్గించారు, కొన్నిటి అనుమతి రద్దు చేస్తున్నామని హెచ్చరించారు.

ఇంజనీరింగ్ కాలేజీ అంటే బంగారు గుడ్లు పెట్టే బాతు వంటిదన్న విషయం ప్రతిఒక్కరికీ తెలుసు. ఒక్కొక్క సీటును 3 నుంచి 6 లక్షల రూపాయల ధరకు అమ్ముకుంటూ, కోట్లు గడిస్తున్నాయి కాలేజి యాజమాన్యాలు. వాటికి ఆశపడి సారాయి వ్యాపారులు, రాజకీయ వాదులు, చదువుపట్ల కనీస అవగాహన లేని వారు కూడా వేలం వెర్రిగా కాలేజీలు పెడుతున్నారు. సారాయి అంగళ్లు తెరిచినంత సులభంగా కళాశాలలు నెలకొల్పుతున్నారు. వీరి లక్ష్యం కేవలం ధన సంపాదన మాత్రమే.

ఉన్నత విద్యావకాశాలు కల్పించడం వేరు; ఉన్నత విద్యను అమ్ముకోవడానికి అవకాశం కల్పించడం వేరు. ఇప్పుడు రాష్ట్రంలో జరుగుతున్నది ఈ రెండవ రకం సేవ మాత్రమే. ఇన్ని కొత్త కాలేజీల మంజూరుకు ప్రభుత్వం చెప్తున్న ఒకే ఒక కారణం - రాష్ట్రంలో చాలినన్ని కాలేజీలు లేక ఆంధ్ర విద్యార్థులు కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలకు వలస వెళ్తున్నారని! అది నిజమే; ఇటీవలి వరకు పరిస్థితి అదే. తమిళనాడులో 40,357 సీటలో 152 కాలేజీలు, కర్ణాటకలో 29,300 సీట్లతో 80 కాలేజీలు వున్నాయి. మహారాష్ట్రలో సైతం 128 కాలేజీలలో 36,379 సీట్లు వున్నాయి. మన రాష్ట్రంలో కాలేజీల సంఖ్య తక్కువ కాబట్టి అధిక శాతం విద్యార్థులు కర్ణాటక, తమిళనాడులకు వలస వెళ్తుండిన మాట నిజమే; ఆ పరిస్థితిని మార్చడానికి మనం కూడా కాలేజీలను అధికంగా ప్రారంభించుకోవల్సిన అవసరం వున్న మాట నిజం. కాని కాలేజి అంటే నాలుగు తరగతి గదులు, ఒక బోర్డు మాత్రమే కాదు. ఇంజనీరింగ్ కళాశాల సక్రమంగా నడవడానికి కొన్ని కోట్ల రూపాయల విలువైన పరికరాలు, లాబొరేటరీలు, భవనాలు, వీటన్నిటిని మించి అనుభవం కల్గిన అధ్యాపకులు కావాలి. ఆ వసతులన్నీ కల్పించగల్గిన సంస్థలకు మాత్రమే అనుమతి ఇవ్వాలి. కాని ఇప్పుడదే జరగడం లేదు. తెలుగుదేశం మంత్రులు, ఎమ్పీలు, ఎమ్మెల్యేలు, వారి బంధువులకు నజరానాల వలె పంచి పెట్టారు వీటిని. అధిక శాతం సంస్థలలో కనీస వసతులు లేవు. కొత్త కాలేజీలలో తొంభైశాతం వాటికి అయ్యవార్లు లేరు. ఇట్లా అర కొర వసతులతో ఏర్పడిన విద్యాసంస్థలు పిల్లలకు చదువు ఎట్లా చెప్పగల్గుతాయి? వాటి నుంచి డిగ్రీలు తీసుకున్న పిల్లల భవిష్యత్తు ఏమిటి? ఇప్పటికే ఉస్మానియా విశ్వవిద్యాలయం కళాశాలలు ఇచ్చిన డిగ్రీలను పలు విదేశీ సంస్థలు గుర్తించడం లేదు. పిలాని వంటి వున్నత విద్యా సంస్థలు ఆంధ్ర రాష్ట్రం నుంచి వచ్చే విద్యార్థులను ప్రత్యేక ప్రవేశ పరీక్షలకు గురి చేస్తున్నాయి. మన డిగ్రీల పట్ల ఇతర ప్రాంతాలలో విలువ లేకుండా పోతున్నది.

ఈ పరిస్థితులలో ఒకేసారి ఇన్ని కొత్త కాలేజీలను, అది కూడా విద్యా సంవత్సరం సగం ముగిసిన తర్వాత మంజూరు చేయడంలో ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించకుండా వుండలేక పోతున్నాము. 1992లో కాంగ్రెస్ ప్రభుత్వం కేవలం ఇంజనీరింగ్ కాలేజీలు మంజూ.. చేస్తే ఇదే చంద్రబాబు నాయుడు ఆనాడు ప్రతిపక్ష నేతగా అలజడి సృష్టించారు; ఆకాశం దద్దరిల్లేటట్లు అల్లరి చేశారు. తాను మాత్రం ఏకంగా 130 కాలేజీలు ఇచ్చిపారేశాడు. అప్పుడు తప్పు అయిన విషయం ఇప్పుడు ఎట్లా ఒప్పు అవుతున్నదో ఆయనకే తెలియాలి.

కేవలం ధనార్జన దృష్టితో ఈ విద్యా సంస్థలు నెలకొల్పుతుండడం వల్ల వీటిలో పని చేయడానికి అనుభవం, అర్హత కల్గిన అధ్యాపకులు ముందుకు రావడం లేదు. వచ్చిన వారికి సరైన జీతాలు ఇవ్వడానికి యాజమాన్యాలు ఇష్టపడడం లేదు. ఫలితంగా ఎందుకు కొరగాని టీచింగ్ సిబ్బంది మాత్రమే వీరికి చవకగా లభిస్తున్నారు. టీచర్, స్టూడెంట్ మధ్య వుండవల్సిన నిష్పత్తిని వీరు పాటించే అవకాశం లేదు. వందల మంది విద్యార్థులకు ఒకే అయ్యవారు పాఠం చెప్పవల్సిన పరిస్థితి నెలకొని వుంది. ఇటువంటి లోపాల వల్ల నష్టపోయేది విద్యార్థులు మాత్రమే. ఉద్యోగాల విషయంలో విపరీతమైన పోటీ

జమీన్‌రైతు

నెలకొని, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం కల్గిన వారు మాత్రమే ఉద్యోగాలకు అర్హత సాధించే పరిస్థితులు నెలకొని వున్న ఈ రోజులలో విద్యార్థులకు కాలేజీలలో సరైన బోధన జరిగినప్పుడే భవిష్యత్తు వుంటుంది. కాని ఈ చదువు అమ్ముకుని బ్రతికే అంగళ్లవంటి ఈ సంస్థలు క్రిందా మీదా పడి డిగ్రీ కాగితం చేతిలో పెట్టి పంపడం తప్ప, విద్యార్థులకు అవసరమైన పరిజ్ఞానం నేర్పించి పంపగలవని ఆశించడం దురాశ అవుతుంది. వీటి వల్ల రాష్ట్రంలోని యువతరానికి లభించేది డిగ్రీలు మాత్రమే కాని చదువు కాదు.

తమ వారికి కొత్త కాలేజీలు పంచి పెట్టడమే కాదు, వాటి యాజమాన్యాలు విద్యార్థుల నుంచి అందినంత దోచుకునే వసతి కూడా కల్పిస్తున్నారు చంద్రబాబు నాయుడు. గత ఆరేళ్లలో నాలుగు సార్లు ఫీజు మొత్తం పెంచడానికి అనుమతి ఇచ్చాడాయన. ఇప్పుడు మరొక సారి, ఫీజు మొత్తాన్ని ఏడాదికి లక్షా రెండువేలకు పెంచడానికి గ్రీన్ సిగ్నల్ ఇవ్వబోతున్నాడు. ఇప్పటి వరకు ఇంటర్మీడియేట్‌లో 60శాతం మార్కులు వచ్చిన విద్యార్థులకు మాత్రమే ఇంజనీరింగ్ విద్యకు అర్హత; యాజమాన్యాల వత్తిడికి తలవొంచి దాన్ని 50శాతానికి తగ్గించ బోతున్నారు. అంటే వీరు సాధ్యమైనంత అధికంగా తమ సీట్లు అమ్ముకునే వీలు కల్పిస్తున్నారన్న మాట.

ప్రభుత్వం ఇంత నిసిగ్గుగా వ్యాపారుల చేతికి చదువుల తల్లిని అప్పచెప్పడం విచారకరం. తన అంతే వాసులకు జీవనోపాధి కల్పించడానికి విద్యా సంస్థలను ఇంత భ్రష్టు పట్టించడం చంద్రబాబు చేయదగిన పని కాదు. ఇప్పటికైనా ఆయన తన తప్పు తెల్సుకొని, కాలేజీ నిర్వహణలో కఠిన నిబంధనలు ప్రవేశపెట్టి, వాటిని ఖచ్చితంగా అమలు చేయాలి. చాలినంత మంది, అర్హులైన ఉపాధ్యాయులు, భవన వసతి, పరికరాలు కల్గిన సంస్థలలో మాత్రమే అడ్మిషన్లు జరిగేటట్లు చూడాలి; ఆ తర్వాత కూడా వాటిలో విద్యా ప్రమాణాల అంచనాకు ఒక స్వయంప్రతిపత్తి కల్గిన సంస్థను ఏర్పాటు చేయాలి. నిబంధనలు పాటించకుంటే కాలేజి గుర్తింపు రద్దు అవుతుందన్న భయం పెడితే తప్ప, యాజమాన్యాలు జాగ్రత్త పడవు. వారి పట్ల అంత మాత్రం కఠినంగా వ్యవహరించకుంటే, డిగ్రీలు అందుకోవడం తప్ప నిపుణులైన ఇంజనీర్లను తయారు చేయలేవు అవి. యాజమాన్యాల ధనార్జనకు విద్యార్థుల భవిష్యత్తును నాశనం కాకుండా చూడవల్సిన బాధ్యత ప్రభుత్వం మీదనే వున్నది అన్న నిజం మరవకూడదు. విద్యార్థులు కూడా తొందరపడి, సీటు దొరికింది అన్న సంబరంతో ఎక్కడపడితే అక్కడ చేరిపోకుండా, తమ చదువుకు కావల్సిన వసతులు పుష్కలంగా వున్న కాలేజీలను మాత్రమే ఎంపిక చేసుకోవడం అవసరం. *

---

## జమీన్‌రైతు 50 ఏళ్ల క్రితం ఈ వారం

జమీన్‌రైతు

8-12-1950

పేజీలు:12 వెల: 0-3-0

### డాక్టర్ రాజేంద్రప్రసాద్

త్యాగమూర్తి, నిరాడంబరుడు, అజాతశత్రు, భారత రిపబ్లిక్ ప్రప్రథమ అధ్యక్షుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్‌కు 3తేదీతో 65 సంవత్సరాలు నిండాయి. ఆయన 66వ జన్మదినోత్సవ సంతోష సమయంలో యావద్భారత జాతి ఆ పుణ్యమూర్తి 'చిరంజీవి' యగుగాకయని భగవంతుని ప్రార్థించింది.

### ముఖ్యవార్తలు

#### ఆస్థాన కవి

తెనుగు ఆస్థానకవి బిరుదాన్ని కళాప్రపూర్ణ, కవి సార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారికి 6తేది మద్రాసులో గవర్నర్ దర్బారులో సమర్పించబడింది.

#### కాంగ్రెస్ కార్యవర్గం

ఈ వారం ఢిల్లీలో సమావేశమైన అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గం హైకమాండు తీర్పును ధిక్కరించి మద్రాసు శాసనసభలో మంత్రులపై తీర్మానం ఎందుకు ప్రతిపాదింపవలసి వచ్చిందో తెల్పవలసిందిగా ప్రకాశం గారిని కోరుతూ, కాంగ్రెస్ డెమాక్రటిక్ ఫ్రంటు నాయకులపై క్రమశిక్షణ చర్య జరపరాదని నిర్ణయిస్తూ; టాండన్, నెహ్రూ, పటేల్, రాజాజీ, ఆజాద్, జగజ్జీవన్‌రాం గార్లతో కేంద్ర పార్లమెంటరీ బోర్డు నేర్పరుస్తూ

తరువాయి 10వ పేజీలో

---

## జనవాణి

# కాల్పుల విరమణ సముచితమే

పవిత్రమైన రంజాన్ మాసాన్ని పురస్కరించుకొని ప్రధాని వాజ్‌పాయి కాశ్మీర్‌లో కాల్పుల విరమణకు పిలుపు నివ్వడం సహేతుక నిర్ణయం. అయితే దీన్ని కొందరు అనవసరంగా విమర్శిస్తున్నారు. మిలిటెంట్లు దీన్ని ఎలా అర్థం చేసుకొన్న మనకు ఇబ్బంది లేదు. కాని ప్రపంచ దేశాలు మాత్రం మన చర్యను అభినందిస్తున్నాయి. కాశ్మీర్ సమస్యను పరిష్కరించడానికి చిత్త శుద్ధితో మనం కృషి చేస్తున్నామన్న విషయం కాల్పుల విరమణ పిలుపుతో స్పష్టమై పోయింది. మతపరమైన విద్వేషాలు రెచ్చగొట్టడం ద్వారా మిలిటెంట్లు ఇప్పుడు కాశ్మీరి ప్రజలను తమవైపు తిప్పుకోలేరు. ఈ వ్యవహారంలో ప్రభుత్వం వ్యూహాత్మకంగానే వ్యవహరించింది. మిలిటెంట్లు కాల్పుల విరమణ సమయంలో బలం పుంజుకొంటారన్న అభిప్రాయం కూడా సరైంది కాదు.

నెల్లూరు వి.శివప్రసాద్

### దొరగారి అసలు రంగు బయటపడింది

దొరగారని పిలుచుకొన్న చోట మాజీ ఎస్పీ నరసయ్య దోపిగా నిలబడ్డారు. వేలకు వేలు జీతాలు పొందే ఐపిఎస్ అధికారులే వక్రమార్గంలో డబ్బు సంపాదనకు పూనుకొంటే దొంగలు, పోలీసులకు తేడా ఏముంది? ఏ శాఖలోని అధికారులైనా నీతులు వల్లించడమే కాదు వాటి ఆచరణకు పూనుకోవాలి. కొత్త ఎస్పీ శ్రీనివాసరెడ్డి డైనమిక్‌గానే కలకాలం తన డ్యూటీని నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

కొడవలూరు కె.పెంచలయ్య

### తిలాపాపంతలాపిడికెడు!

వ్యవసాయ రంగం సంక్షోభంలో పడిపోయిందని, కేంద్ర ప్రభుత్వం తగిన విధంగా స్పందించడం లేదని ఇటీవల కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియాగాంధీ పార్లమెంట్‌లో ధ్వజమెత్తారు. అసలు రైతులు ఇంతటి దయనీయ స్థితికి రావడానికి కాంగ్రెస్ వారే కారణం. పి.వి. నరసింహారావు, మన్‌మోహన్‌సింగ్ సరళీకృత ఆర్థిక విధానాల పేరుతో వ్యవసాయ రంగాన్ని దారుణంగా [illegible] చేశారు. కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం గతంలో కాంగ్రెస్ విధానాలను విమర్శించి

తరువాయి 10వ పేజీలో

# ఖైదీలవార్డు-కాసులయార్డు

నెల్లూరు పెద్దాస్పత్రిలో ఖైదీల వార్డు, గార్డు డ్యూటీకోసం పోలీసులు ఎగబడుతున్నారు. దీనికి కారణం ఇక్కడ డ్యూటీ చేసేవారికి సంపాదన బాగుండడమేననాలి. ఖర్మ కాలి ఏదో ఒక కేసులో పారిశ్రామికవేత్తలు, రాజకీయ నాయకులు, వ్యాపారస్తులు రిమాండ్ మీద జైలుకు వెళ్తే వెనువెంటనే ఆరోగ్యం బాగోలేదని

### డ్యూటీల కోసం పోటా పోటీ

జైలు డాక్టర్ వారిని పెద్దాస్పత్రికి మెరుగైన చికిత్స కోసం పంపిస్తారు. ఇలా పంపను జైలు డాక్టర్ వెయ్యి రూపాయల మొత్తం లంచంగా తీసుకొంటుండగా, అంతా బాగున్న వ్యక్తి రోగి అని చెప్పను పెద్దాసుపత్రి డాక్టర్ కూడా అదే మొత్తం పుచ్చుకొంటున్నారు. ఈ విధంగా తరలించిన వారికి చికిత్స చేయను పెద్దాస్పత్రిలో ఎనిమిది పడకలు గల ఒక వార్డుంది. ఈ వార్డుకు నలుగురు పోలీసులు గార్డులుగా వ్యవహరిస్తారు. అనారోగ్యమనే కుంటిసాకుతో చేరిన పెద్ద మనుషులకు వీరు బేడీలు వేయరు. వాస్తవంగా ఖైదీల వార్డులో చికిత్స పొందే వారికి బేడీలు వేయాలి. బయట నుంచి ఖైదీలు బిర్యానీ, మందు, సిగరెట్లు, సెల్‌ఫోన్లు సమస్తం తెచ్చుకొని కుషీగా వుండను ఒప్పుకొంటారు. సందర్శకులను సైతం విపరీతంగా అనుమతిస్తారు. దీనికిగాను గార్డు డ్యూటీ చేసేవారికి రోజుకు అక్షరాల వెయ్యి రూపాయలు చెల్లించాలి. ఈ మొత్తం ప్రతిరోజూ చెల్లిస్తుంటే రిమాండ్ ఖైదీకి ఇంటికన్నా పెద్దాసుపత్రిలోని ఖైదీల వార్డులో సుఖంగా గడిచిపోతుంది. రెండు, మూడు రోజుల్లో ఏదో విధంగా బెయిల్ వచ్చేస్తుండడంతో కోర్టు ఆక్షేపించి రిమాండ్‌కు పంపినా పెద్దలు 'జైలు కూడు' తినకుండానే దర్జాగా బయటకు వచ్చేస్తున్నారు. 2000 సంవత్సరంలో రిమాండ్‌కు

తరువాయి 11వ పేజీలో

# ఆత్మకూరు బస్టాండ్ కంపు, కంపు

వర్షమొస్తే చాలు నెల్లూరు ఆత్మకూరు (పొట్టి శ్రీరాములు) ఆర్టీసి బస్టాండులో అడుగు తీసి అడుగు వేయలేని దుస్థితి నెలకొంటుంది. దీనికి కారణం బస్టాండ్‌లో సిమెంటు ఫ్లోరింగ్ వేయక పోవడమేననాలి. అత్యంత ప్రధానమైన బస్టాండ్‌ను ప్రారంభించి మూడేళ్లు అవుతున్నా సిమెంట్‌తో ఫ్లోరింగ్

## నెల్లూరుసంగతులు

వేయించాలన్న ఆలోచన ఆర్టీసి అధికారులకు రాలేదు. గతవారం రోజులుగా కురిసిన వర్షాలకు బస్టాండ్‌లో పోసిన ఎర్రమట్టి తడిసి ముద్దయ్యి బురదమయ మయ్యింది. ప్లాట్‌ఫారం దిగి నాలుగడుగులు వేసేలోపే కాళ్లకు వేసుకున్న చెప్పులు, వంటి మీద బట్టలు ఖరాబైపోతాయి. ప్లాట్ ఫారం వద్ద కాకుండా బస్టాండులో ఓ ప్రక్కన ఆగే అల్లూరు, విడవలూరు రూట్లలో బస్సులు ఎక్కను ప్రయాణీకులు పడరాని పాట్లుపడుతున్నారు. నిత్యం వందలాది బస్సులు, వేలాది ప్రయాణీకులు వెళ్తూ లక్షలాది రూపాయలు ఆర్టీసికి లాభం చేకూర్చే ప్రధాన బస్టాండ్‌పై అధికారులు చిన్నచూపు చూడడం సబబుకాదు.

ఈ బస్టాండ్‌లోకి బస్సులొచ్చే మార్గం అత్యంత అధ్వాన్న స్థితిలో వుంది. 50 మీటర్లపొడవుండే బస్టాండ్‌లో కలిసే ఈ సైడ్ రోడ్డులో మోకాలు లోతు మించిన మూడు గుంటలు ఏర్పడిపోయాయి. వీటిల్లో నిరంతరం నీళ్లు నిలచి వుండడం వల్ల రోజురోజుకి ఈ గుంటలు పెద్దవై పోతున్నాయి. నిత్యం వందలాది బస్సులు ప్రయాణించే ఈ రోడ్డుతో తమకు సంబంధంలేదని ఆర్టీసి ప్రకటిస్తే, సంబంధమున్న మునిసిపాలిటీ గుంటలు పూడ్చే పనిచేపట్టడం లేదు. ఎమ్మెల్యే, కలెక్టర్ ఒకసారి పర్యటించి, ఈ గుంటలు పూడ్చమని చెప్పినా పట్టించుకొన్న మునిసిపల్ అధికారి లేరు.

తరువాయి 11వ పేజీలో

# హోంగార్డులూ! మంచిపేరు తెండి

హోంగార్డుల వల్ల పోలీసు శాఖకు మంచిపేరు వచ్చిందని దాన్ని మరింత పెంచేందుకు హోంగార్డులు కృషి చేయాలని జిల్లా ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డి చెప్పారు. 6 తేది పోలీసు పెరేడ్ గ్రౌండ్‌లో జరిగిన హోంగార్డు దినోత్సవాన్ని పురస్కరించు

### ఎస్పీ ఉద్బోధ

కొని ఎస్పీ మాట్లాడారు. హోంగార్డులు పోలీసులతో సమానంగా విధి నిర్వహిస్తున్నారు. నక్సల్ ప్రభావం గల జిల్లాల్లో విధి నిర్వహణలో ప్రాణాలు సైతం కోల్పోతున్నారు. హోంగార్డులు పోలీసు శాఖలో అర్థభాగమై శాంతిభద్రతలు కాపాడడంలో, బందోబస్తులు నిర్వహించడంలో మంచి ప్రతిభ చూపుతున్నారు. గతంలో హోంగార్డ్స్ ఉద్యోగం పార్టు టైమ్‌గా వుండదేని ఇప్పుడు అది పూర్తి స్థాయి ఉద్యోగంగా మారిందన్నారు. దురదృష్టవశాత్తు హోంగార్డులకు ఇంకా పూర్తి వసతులు ఒనకూడలేదు. వచ్చే రెండు మూడేళ్లలో వీరి పరిస్థితి మరింత మెరుగు పడుతుందన్నారు. మహిళా పోలీసులతో సమానంగా హోంగార్డుల నియామకాల్లో ఏడు శాతం మహిళలను చేర్చుకోవాలని ఇటీవల ఉన్నతాధికారులు నిర్ణయించినట్లు చెప్పారు. హోంగార్డుల కంపెనీ కమాండర్ సి.ఎన్.రెడ్డి మాట్లాడుతూ ఖాకీ యూనిఫారం ధరిస్తున్న హోంగార్డులు యూనిఫారం విలువ కాపాడి ప్రజలు, పోలీసు అధికారుల మన్ననలు పొందాలన్నారు. ఏఎస్పీ టి.రవికుమార్ మూర్తి, హోంగార్డ్స్ డిఎస్పీ

తరువాయి 11వ పేజీలో



నెల్లూరు ఆర్ అండ్ బి గెస్ట్‌హౌస్‌లో మాట్లాడుతున్న సిఎల్పీ నేత వైఎస్ రాజశేఖర్ రెడ్డి. ప్రక్కన ఎమ్మెల్యేలు రామనారాయణ రెడ్డి, వివేకానందరెడ్డి, డిసిసి అధ్యక్షుడు సి.వి. శేషారెడ్డి

# వాజ్‌పేయి మనోమందిరంలో రాముడు!

కూల్చివేసిన బాబ్రీ మసీదు స్థలంలో రామమందిరం కట్టడమే బిజెపి రహస్య అజెండాలోని ముఖ్యాంశమని సిఎల్పీ నేత వై.ఎస్.రాజశేఖరరెడ్డి ఆరోపించారు. పులివెందులకు పోయేందుకు విజయవాడ నుంచి వచ్చిన వైఎస్. రాజశేఖరరెడ్డి 7తేది ఆర్అండ్‌బి అతిథి గృహంలో కాసేపు ఆగి విలేఖరులతో మాట్లాడారు. రామాలయ నిర్మాణం జాతి మనోభీష్టమని ప్రధాని చెప్పడం ఆశ్చర్యంగా వుంది. బాబ్రీ మసీదు కూల్చిన రోజు పార్లమెంట్‌లో ప్రతిపక్ష నేతగా వాజ్‌పాయి మాట్లాడుతూ ఇది దురదృష్టకర సంఘటన. నేను సిగ్గుతో తలదించుకొంటున్నానన్నారు. ఇప్పుడేమో మాట మార్చి మాట్లాడుతున్నారు. ఆర్.ఎస్.ఎస్. వత్తిడి మీదే ప్రధాని ఈ విధంగా మాట్లాడుతున్నారు. దేశం సవాలక్ష సమస్యలు ఎదుర్కొంటుండగా మసీదు కూల్చిన స్థలంలో ప్రస్తుతం రామమందిరం కట్టడం ప్రధానాంశం కాదన్నారు. రైతులు పండించిన పంటలకు గిట్టుబాటు ధరలు లేవు. పరిశ్రమలు మూతపడి పలువురు కార్మికులు వీధినపడ్డారు. నిత్యావసర వస్తువుల ధరలు పెరిగి అన్ని వర్గాల ప్రజలు అల్లాడుతున్నారు. దేశంలో రైతులు, నిరుద్యోగుల ఆత్మహత్యలు ఎక్కువయ్యాయి. ఈ దశలో రామమందిరం ఆవశ్యకత ఏమిటన్నారు. మతాన్ని ముందు పెట్టుకొని పరిపాలిస్తున్న కేంద్ర ప్రభుత్వానికి ఇప్పటికైనా తెలుగుదేశం పార్టీ మద్దతు ఉపసంహరించుకొంటే గౌరవంగా

### నెల్లూరులో వై.ఎస్.

వుంటుందని రాజశేఖరరెడ్డి సలహా యిచ్చారు.

రాష్ట్ర ప్రభుత్వం పలు ప్రజావ్యతిరేక విధానాలకు పాల్పడుతూందని, తాము నిత్యం వీటిని వ్యతిరేకిస్తున్నా పాలకులు ధోరణి మార్చుకోవడం లేదన్నారు. ఇది సిగ్గులేని ప్రభుత్వం, అసెంబ్లీ ఎన్నికల్లో 43శాతం ఓట్లు తెచ్చుకొన్న ప్రతిపక్షం నిర్మాణాత్మక సూచనలు చేస్తే దాన్ని రాజకీయమంటారు. ప్రజలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్న ప్రజావ్యతిరేక విధానాలను గమనిస్తున్నారని వీరికి తగిన బుద్ధి చెప్పే రోజులు దగ్గర పడ్డాయని రాజశేఖరరెడ్డి జోస్యం చెప్పారు. డిసిసి అధ్యక్షుడు సి.వి.శేషారెడ్డి, ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, రామనారాయణ రెడ్డి, కోటంరెడ్డి శ్రీధరరెడ్డి ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## మానస నృత్య ప్రదర్శన

సింహపురి సంగీత సభ నేతృత్వంలో 3తేది టౌన్‌హాల్‌లో నాట్యమయూరి అచ్యుతమానస ప్రదర్శించిన కూచిపూడి నృత్య ప్రదర్శన ఆద్యంతం ప్రతిభావంతంగా సాగింది. "ముద్దుగారే యశోద ముంగిట ముత్యమువాడు" అనే అన్నమాచార్య కీర్తనలో బాలకృష్ణుడు యశోదకు నోటిలో పధ్నాలుగు భువనభాండాలను చూపడం, కాళీయ మర్దనం చేయడం వంటి ఘట్టాలను ఆమె

తరువాయి 11వ పేజీలో

# అక్షరసంక్రాంతి కాంతులు విరజిమ్మాలి

అక్షరాస్యతా కార్యక్రమాన్ని ఒక ఉద్యమంలా చేపట్టి విజయవంతంగా నిర్వహించేందుకు ప్రతిఒక్కరూ బాధ్యతగా తమ శాయశక్తులా కృషిచేసి జిల్లాను రాష్ట్రంలో ప్రథమ స్థానంలో నిలపాలని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. 1తేది కలెక్టరేట్ ఆవరణంలో వీడియో కాన్ఫరెన్స్ హాలును ప్రారంభించి వైర్‌లెస్ సెట్ల ద్వారా జిల్లాలోని అన్ని మండల కేంద్రాల అధికారులతో ఈ కార్యక్రమ అమలు తీరును సమీక్షించారు. ఉద్యమాలకు పుట్టినిల్లైన జిల్లా అన్ని పథకాలతో ఇప్పటి వరకు ప్రథమస్థానంలో వుంది. అక్షర సంక్రాంతిలో కూడా ఇదే విధంగా వుంచి ఇతర జిల్లాలకు ఆదర్శంగా నిలవాలని మంత్రి సూచించారు. 20వేల అక్షర కేంద్రాలను ప్రారంభించి మొత్తం మీద 3లక్షల మందికి విద్యను నేర్పాలి. ఇది ఒక ప్రభుత్వ కార్యక్రమంలా కాకుండా సేవాభావంతో స్వంత కార్యక్రమంలా భావించి సమాజ శ్రేయస్సుకు కృషి చేయాలన్నారు. జిల్లాలోని పొదుపులక్ష్మి, డ్వాక్రా, వనసంరక్షణ సమితి, నీటి వినియోగదారుల సంఘాలు, సి.ఎం.ఇ.వై., యువశక్తి గ్రూపులు, మహిళా మండలి సభ్యులు ఈ కార్యక్రమాన్ని స్వచ్ఛందంగా చేపట్టి పూర్తి చేయాలన్నారు. కోవూరు, అనుమసముద్రంపేట, జలదంకి, ఇందుకూరుపేట, బుచ్చిరెడ్డి పాళెం మండలాలకు చెందిన అధికారులతో మంత్రి వైర్‌లెస్ సెట్లలో అక్షర సంక్రాంతి కార్యక్రమ ప్రగతిని అడిగి తెలుసుకొన్నారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ కె.ప్రవీణ్‌కుమార్, జాయింట్ కలెక్టర్ ఎస్.ఎస్.రావత్, డిఆర్వో వెంకటే

### ఆదాల అభిభాషణం

శ్వర్లు ఇతర అధికారులు పాల్గొన్నారు.

## మండల కార్యాలయంలో ఎమ్మెల్యే!

తాను సృష్టించుకున్న ప్రజాపథం కార్యక్రమంలో భాగంగా నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి 4తేది ఎమ్మార్వో కార్యాలయాన్ని సందర్శించారు. ఎమ్మార్వో పెంచలరెడ్డిని గతంలో ప్రజలిచ్చిన వినతి పత్రాల గూర్చి ప్రశ్నించారు. దీనిపై ఎమ్మార్వో మాట్లాడుతూ ఏ సమస్య మీదనైనా ప్రజలు తన వద్దకు వస్తే తక్షణం స్పందిస్తున్నట్లు చెప్పారు. పక్కా గృహాల మంజూరు విషయంలో పరిష్కారదిశగా వనంతోపు, కొండాయపాళెం, పడారుపల్లి, నక్కలగుంట, వైకుంఠపురం ప్రాంతాలున్నాయని ఎమ్మార్వో, ఎమ్మెల్యేకు వివరించారు. కౌన్సిలర్లు ఆరోగ్యస్వామి, మాజీ కౌన్సిలర్ మునాఫ్, నిర్మలమ్మ, శ్రీనివాసులురెడ్డి తదితరులు ఎమ్మెల్యే వెంట పాల్గొన్నారు.

## బురదలో దిగి వివేకా ప్రజల పరామర్శ

ఇటీవల కురిసిన భారీ వర్షాలకు ఇళ్లలో నీరు ప్రవేశించిన బాలాజీనగర్ శివారు ప్రాంత ప్రజలను ఎమ్మెల్యే వివేకానందరెడ్డి 5తేది పరామర్శించారు. మోకాలు లోతు బురదలో సైతం ఎమ్మెల్యే నడిచివెళ్లి ప్రజల యోగ క్షేమాలు తెలుసుకొన్నారు. ఈ ప్రాంతమంతా నీళ్లు నిలచి ఉండడంతో మోటార్లు పెట్టి నీరు తొలగించవలసిందిగా మునిసిపల్ ఇంజనీరింగ్ సిబ్బందికి ఆదేశాలు జారీచేశారు.

తరువాయి 11వ పేజీలో

# పెన్నలో కొట్టుకుపోయిన నాలుగులక్షలు

అధికారులు ఆదేశాలు జారీ చేయకపోయినా, రాజకీయ నాయకుల స్వార్థం వల్ల నాలుగు లక్షల రూపాయల ప్రభుత్వ సొమ్ము నీటిపాలయ్యింది. జిల్లాలో నాన్‌డెల్టా సాగుకు నీటి సమస్య గత నాలుగేళ్లుగా కల్గుతూంది. ఈ నేపథ్యంలో అధికారులు, పాలకులు సమావేశమయ్యి జనవరి మాసంలో సంగం ఆనకట్టపై ఇసుక బస్తాలతో

## ఇసుక బస్తాల్లో అవినీతి జబర్దస్తీ

మట్టం ఏర్పాటు చేసి రైతులను నీటి ఎద్దడి నుంచి రక్షించేవారు. ఈసారి కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి చేసిన పైరవీ వల్ల ఇసుక బస్తాలు వేసే కాంట్రాక్టర్లు పోటీలు పడ్డారు. మామూలుగా జనవరిలో ఏర్పాటు చేసే ఇసుక బస్తాలు నవంబరు 22తేదీనే వేసేసారు. గతవారంలో కురిసిన వర్షాలకు పెన్నకు వరద రావడంతో ఈ బస్తాలన్నీ కొట్టుకుపోయాయి. బస్తాలు వేసిన వారికి మాత్రం లక్షల రూపాయల బిల్లులు చెల్లించేశారు. తుఫాన్ల నెల కాబట్టి నవంబర్ నెలలో బస్తాలు ఏర్పాటు చేయకూడదు. కాని దీనికి విరుద్ధంగా బస్తాలు ఏర్పాటు చేయించిన అధికారులపై ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. నీటిని జాగ్రత్తగా కాపాడాలి కాబట్టి మళ్లీ ఇసుక బస్తాల ఏర్పాటుకు ప్రభుత్వం నాలుగు లక్షల రూపాయలు ఖర్చుచేయక తప్పని పరిస్థితి ఏర్పడింది.

## వెంకటగిరి ఎస్ఐ బదలీ

అవినీతిమయమైపోయిన వెంకటగిరి పోలీస్ స్టేషన్ ఒకదారికి తెచ్చేందుకు జిల్లా ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డి చర్యలు చేపట్టారు. ఎస్ఐ జయరామసుబ్బారెడ్డి, మరో కానిస్టేబుల్‌ను విఆర్‌కు బదలీ చేస్తూ ఆకస్మికంగా ఉత్తర్వులు జారీ చేశారు. జయరామసుబ్బారెడ్డి ఈ స్టేషన్‌కు వచ్చి ఆరు నెలలే అయినా స్టేషన్‌లో అవినీతి తలుపులు బార్లా తెరిచారు. ఎస్పీ జరిపిన శాఖాపరమైన దర్యాప్తులో ఇవి నిజమని తేలడంతో బదలీ ఉత్తర్వులొచ్చాయి.

# ఎంఇఓ దర్బార్‌లో చదువుబేజారు

బుచ్చిరెడ్డిపాళెం ఎం.ఇ.ఓ రమణ ప్రసాద్ అనాలోచిత నిర్ణయాల వల్ల మండలంలో కొంత మంది విద్యార్థుల భవిష్యత్తు అగమ్యగోచరంగా తయారయ్యింది. తన కోటరీలోగల ఉపాధ్యాయులను అవసరం లేకున్నా ఆన్‌డ్యూటీ అంటూ వారిని పాఠశాలకు పంపకుండా తన వెంట తిప్పుకొంటున్నారాయన.

## అధికార్లకు 'రొయ్యల' మేత

ఇటీవల ఎం.ఇ.ఓ తీసుకున్న కొన్ని తప్పుడు నిర్ణయాల వల్ల పంచేడు, వవ్వేరు, వడ్డిపాళెం పాఠశాలలో చదువుతున్న 7వ తరగతి విద్యార్థుల భవిష్యత్తు ప్రశ్నార్థకమయ్యింది. ఇటీవల జరిగిన విద్యా కమిటీ ఎన్నికల కోసం 9 మంది ఉపాధ్యాయులను ఎన్నికల అధికారులుగా ఎంఇఓ నియమించారు. వీరిలో వవ్వేరు నుంచి ఇద్దరు బిఇడిలు, పంచేడు నుంచి ఇద్దరు బిఇడి ఉపాధ్యాయులున్నారు. పంచేడులో ఇక మిగిలింది ఇద్దరు ఉపాధ్యాయులే. అందువల్ల పంచెడుకి మినగల్లు నుంచి ఇద్దరు టీచర్స్‌ను డిప్యూటేషన్‌పై వేశారు. కాని ఇదే సమస్య ఉన్న వవ్వేరుకు ఎవర్నీ నియమించక పోవడం శోచనీయం. అవసరం ఉన్న చోట ఉపాధ్యాయులను నియమించక పోవడం, చిత్తశుద్ధిగా పాఠశాలకు వెళ్లి ఉపాధ్యాయులను ఆన్‌డ్యూటీ పేరుతో ఎం.ఇ.ఓ తన వెంట తిప్పుకోవడం ఇటీవల కాలంలో ఆయనకు అలవాటు అయిన కార్యక్రమంలా మారింది. ఇస్కపాళెం, వడ్డిపాళెం ప్రాథమికోన్నత పాఠశాలల్లో ప్రస్తుతం ఇద్దరు ఉపాధ్యాయులే వున్నారు. ఈ పాఠశాలలో

తరువ 8వ పేజీలో

# ఎవడీ 'కంత్రీ' స్వామిజీ

ప్రజల అజ్ఞానాన్ని సొమ్ము చేసుకొను పలు రకాల వ్యక్తులు సమాజంలో పుట్టుకొస్తుంటారు. కళ్లులేని వారికి కంటి చూపు తెప్పిస్తానని ఓ 'స్వామి' ఇటీవల బయలు దేరారు. ప్రస్తుతం ఆయన నివాసం జిల్లా మంత్రి స్వగ్రామం

## కంటి వైద్యం పేరుతో అమాయకులకు ఎర

అల్లూరు మండలంలోని నార్తుమోపూరు గ్రామంలోని మహాలక్ష్మమ్మ గుడి వద్ద తిష్టవేసి ఆదివారం, బుధవారం ప్రజల కళ్లలో మందులేస్తున్నాడు. ఇతని పేరు చంద్రస్వామట. షిర్డీ సాయిబాబా కలలో కనపడి చెప్పిన మూలికలతో ఈ కంటి చికిత్స చేస్తానంటున్నాడు. కంటి చూపులు తిరిగివచ్చే వరకు భక్తులు మందు పోయించుకొంటూనే వుండాలట. ప్రతివారం స్వామీజీకి ఫీజు చెల్లించాలట. స్వామీజీ కంటిలో మందు పోసేటప్పుడు ఆయన్ను ఎవ్వరూ పలుకరించకూడదట. ఎవరూ తాకకూడదట. 10 నిమిషాల తర్వాత ఒక క్యారెట్ గడ్డ తినాలని స్వామి శిష్యులు చెబుతున్నారు. 41 రోజులు పత్యం పాటించాలని, ఎండను తిరగకుండా వుంటె కంటి చూపు రావడం ఖాయమంటున్నారు. సాయంత్రం 4 గంటలు దాటితే స్వామి ఈ మందు వేయరట. స్వామి ఈ మందును మేకలు, గొర్రెలు, బర్రెలు, ఎద్దుల మీద ప్రయోగించి ఫలితం సాధించినట్లు శిష్యుల ప్రచారం. కంటి ఆపరేషన్లకు వేలాది రూపాయలు ఖర్చు పెరిగిపోవడం వల్ల వందల రూపాయల్లో తాను వైద్యం చేస్తున్నట్లు స్వామీజీ చెబుతున్నారు. స్వామీజీ వైద్య విధానమేమిటో ఆరోగ్య శాఖాధికారులు ఒకసారి పరీక్షిస్తే అమాయక ప్రజలకు మేలు చేసిన వారవుతారు.



ఐ.ఎం.ఏ. రాష్ట్ర అధ్యక్షునిగా ఎన్నికైన డాక్టర్ అశోక్‌ను సత్కరిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి. ప్రక్కన డాక్టర్ శ్రీధర్, కొల్లి శ్యామసుందర్ రెడ్డి, పులిమి వెంకటరెడ్డి.

# గస్తీలో పోలీసులు - బస్తీలో దొంగలు

పోలీసు పెట్రోలింగ్ వ్యవస్థ సరిగ్గా లేకపోవడం వల్ల జాతీయ రహదారి, పట్టణ శివారు ప్రాంతాలు, జిల్లా సరిహద్దు ప్రాంతాల్లో దోపిడీలు పెరిగిపోతున్నాయి. ఏదైనా సంఘటన జరిగినప్పుడు మినహా మిగతా సమయాల్లో పోలీసులు నిర్లిప్తంగా వ్యవహరిస్తున్నారు. ఎస్పీ గారిలో కనిపిస్తోన్న స్పీడు సిబ్బందిలో కనపడటం లేదు. జిల్లాలో శివారు ప్రాంతాలుగా ఐదు డివిజన్లున్నాయి. వీటిలో మర్రిపాడు - ముంబాయి రోడ్డు, కావలి హైవే, గూడూరు హైవే, రాపూరు, ఉదయగిరి ప్రాంతాలున్నాయి. ఈ ఏడాది ఈ ఐదు డివిజన్లలోనూ దారి దోపిడీలు జరిగాయి. ఈ దోపిడీలు అరికట్టేందుకు మాజీ ఎస్పీ సి.వి.నరసయ్య పోలీసు మొబైల్ బస్సులను ఏర్పాటుచేసి, ఒక్కొక్క బస్సులో డజను మంది సిబ్బందిని నియమించారు. ఈ మొబైల్ పోలీసులు తిరగరని దొంగలకు తెలుసుకాబట్టి జాతీయ రహదార్లపై దొంగతనాలు యదేచ్ఛగా జరిగిపోతున్నాయి. మొబైల్ పోలీసులు ఏదో ఒక చోట తమ బస్సులను ఆపుకొని బర్రెల లారీలు, ఇతర రాష్ట్రాల నుంచి వచ్చే లారీలను నిలిపి మామూళ్లు వసూలు చేసుకొంటున్నారు. గతంలో ఈ పనులకు పాల్పడిన వారిని సస్పెండ్ చేసినా వీరి వైఖరిలో మార్పు రాలేదు. కొందరు మొబైల్ బస్సులో డ్యూటీలు చేసే పోలీసులు రోజుకు నలుగురు చొప్పున ఇళ్లకు వెళ్లి గైర్ హాజరు అయ్యి వస్తున్నారు. మొబైల్ పోలీసుల వైఫల్యం వల్లే ఇటీవల అల్లూరు సమీపంలోని పెట్రోల్ బంకు సిబ్బందిని దొంగలు చంపి మరీ సొత్తును చోరీ చేశారు. మర్రిపాడు సమీపంలో నాలుగుసార్లు బస్సు దోపిడీలు జరిగి

## జిల్లావార్తలు

దొంగలు లక్షలు దోచుకెళ్లారు. నెల రోజుల క్రితం తడ, నాయుడుపేట ప్రాంతాల్లో దోపిడీలు జరుగుతూనే ఉన్నాయి. నెల్లూరు సంతపేటలో జనసమర్థంగా వుండే ప్రాంతంలో ఒక మహిళ గొంతు కోసి నగలు దోచుకెళ్లారు. వాళ్ల ఆచూకీ ఇంత వరకు తెలియలేదు. మొబైల్ పోలీసులుగా కాస్త ఉత్సాహమున్న వారిని నియమించి ఎస్పీ అప్పుడప్పుడు తనిఖీ నిర్వహిస్తే జిల్లా వ్యవస్థ బాగుపడుతుంది. తద్వారా దోపిడీలు తగ్గుతాయి.

## అవినీతిలో ఘనుడు నల్లపాళెం వి.ఏ.ఓ

పొదలకూరు మండలం నల్లపాళెం వి.ఏ.ఓ. చిన్నహనుమారెడ్డి చేస్తున్న అవినీతి అంతా ఇంతా కాదు. 1995 ప్రాంతంలో ఈయనగారు చేసిన అవినీతి పనులకు సస్పెండ్ చేసేవరకు పరిస్థితులు దారితీసినా అప్పుడు ఎమ్మెల్యేగా వున్న కొమ్మి లక్ష్మయ్య నాయుడు రక్షించారట. లక్ష్మయ్యనాయుడు అండదండలు కొని ఈ వి.ఏ.ఓ. భూ బకాసురుడిగా మారాడు. నల్లపాళెం గ్రామం సర్వే నెంబరు 226లో మూడు ఎకరాల పొలాన్ని ఆయన తల్లి సీతారామమ్మ పేరు మీద పట్టా తీశాడు. సర్వే నెంబరు 245లో 3 ఎకరాలు తన భార్య సుశీలమ్మపై, సర్వే నెంబర్లు 246, 247, 248, 168, 181లలో 16 ఎకరాలను పలువురి బినామీ పేర్లతో స్వంతం చేసుకొని లక్షలాది రూపాయలకు అమ్ముకొంటున్నాడు. డబ్బిస్తే ఫోర్జరీ పాసు పుస్తకాలు, పట్టా ఒకరిది అనుభవం మరొకరిదని వ్రాసిస్తున్నందు వల్ల గ్రామంలో తగాదాలు కూడా జరుగుతున్నాయని గ్రామస్తులు గగ్గోలు పెడుతున్నారు.

తరువ 12వ పేజీలో

5వ వార్షికోత్సవ, రంజాన్, క్రిస్మస్, సంక్రాంతి సందర్భంగా
'చందన' లో గోల్డ్ గిఫ్ట్ హ్యాంపర్
1 1/2 Kg. గోల్డ్ 135 మంది విజేతలు
కంచిపట్టు చీరలపై బెనిఫిట్ ఆఫర్: పండుగలు, పెళ్ళిళ్ళ సందర్భంగా పట్టు చీరలపై అత్యంత తగ్గింపు ధరలు. ఈ అవకాశం 11-12-2000 వరకు మాత్రమే.
రూ. 200/- లు కొనుగోలుపై ఒక గిఫ్ట్ కూపన్ పొందండి.
ఒక గిఫ్ట్ కూపన్‌పై 2 బహుమతులు గెల్చుకొనే గొప్ప బంగారు అవకాశం
డైలీ డ్రా తేది: 14.12.2000 వరకు ప్రతిరోజు ముగ్గురు విజేతలకు 3 గోల్డ్ నెక్లెస్‌లు
బంపర్ డ్రా తేది: 14.1.2001 న ముగ్గురు విజేతలకు 3 రాణీహారం సెట్లు
6-12-2K "గోల్డ్ నెక్లెస్" విజేతలు రాత్రి 8-00 గం॥లకు బహుమతులను అందుకోగలరు.
1 కూపన్ నెంబరు : 10460 J.అభిషేక్ 16/118, నెల్లూరు.
2 కూపన్ నెంబరు : 10372 రమణారెడ్డి పొదలకూరు.
3 కూపన్ నెంబరు : 9805
కష్టమర్లే మా దేవుళ్ళు వారి కొరకే ఈ తగ్గింపు ధరలు, గిఫ్ట్ స్కీములు
చందన బ్రదర్స్
We Accept All Bank Cards

# నెల్లూరు ముచ్చట్లు

## యానాదిరెడ్డికి అనారోగ్యం

జిల్లాకాంగ్రెస్ వాదులందరిలోకి సీనియర్ నేత, మాజీ ఎమ్మెల్యే, మాజీ మంత్రి కలికి యానాదిరెడ్డి గారు తీవ్ర అనారోగ్యంతో మద్రాసు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. వూపిరితిత్తులలో చేరిన నెమ్ము తొలగించడం డాక్టర్లకు అలివి కాకపోవడంతో ఆయన మంచమెక్కవల్సి వచ్చింది.

యానాదిరెడ్డి గారు త్వరలో సంపూర్ణ ఆరోగ్యంతో తిరిగి రావాలని, పరమ శివుడు ఆయనకు పూర్ణాయుర్దాయం కల్పించాలని ప్రార్థిస్తున్నాము.

## చక్కెర ఫ్యాక్టరీ నిధులకోసం కన్నం?

చక్కెర ఫ్యాక్టరీ విస్తరణ పనులు చేపట్టిన కాంట్రాక్టర్ల నుంచి కనీసం పది లక్షల రూపాయలు దండి తనకుతెచ్చి ఇవ్వవల్సిందగా ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరక్టర్‌ను ఒత్తిడి చేస్తున్నారట ఎమ్మెల్యే ప్రసన్నకుమార్ రెడ్డి. అది తనకు సాధ్యం కాదని, కాంట్రాక్ట్ పనులు చేపట్టింది కెసిపి కాబట్టి, వారిని తాను బెదరించ లేనని ఎం.డి. గారు చేతులెత్తేశారట. దానితో ఉగ్రుడైన ప్రసన్న ఎం.డి. బదలీ కోసం సంబంధిత మంత్రి దగ్గర పాఠం పట్టి వున్నారు. అసలే అధ్వాన్న దశలో వుంది చక్కెర ఫ్యాక్టరీ; దాన్ని ఇట్లా రాజకీయవాదులు కొరుక్కుని తినజూస్తే మూతపడి పోతుంది. రైతులు కల మేలుకుని ఇటువంటి నీచపు పనులకు పాల్పడే రాజకీయవాదుల నుంచి ఫ్యాక్టరీని కాపాడుకోవడం అవసరం.


**ఇల్లు అమ్మబడును**

నెల్లూరు టౌన్, మైపాడు రోడ్డు, 32/1708, కిసాన్ నగర్‌లోని 40 అంకణాల స్థలంలో 8 అంకణాల కట్టుబడి కలిగిన ఇల్లు అమ్మబడును. వివరాలకు అదే యింట్లో **మునుస్వామి రెడ్డి గారిని (లేక) ఫోన్ : 335115లో చెన్నారెడ్డి** గారిని కానీ సంప్రదించండి.


నెల్లూరుజిల్లా కన్స్యూమర్ ఫోరం కోర్టు

C.D.No: 644/2000

M.వెంకటసుబ్బయ్య - వాది

Vs

R1. ఆలూరు రఘునాథరెడ్డి

R2. అనుమరెడ్డి విష్ణువినోద్‌కుమార్‌రెడ్డి

R3 A.V.రాజగోపాల్‌రెడ్డి - ప్రతివాదులు

అందుమూలముగా తెలియజేయడమే ఏమనగా పై నెంబరుకేసులో 11.12.2K తేదిన ప్రతివాదుల నోటీసు నిమిత్తమై యున్నది. ఆ దినము 10.30A.M. మీరు కాని మీ వకీలు ద్వారాగాని హాజరుకానిచో పరోక్షమున తీర్మానించబడును.

A.చంద్రశేఖరగుప్త B.A. B.L.,

B.వెంకటేశ్వర్లు M.A. B.L.,

Advocates, 3/25, S.H.Pet, NLR-2

అదనపు సీనియర్ సివిల్ జడ్జి కోర్టు ఒంగోలు

I.A. No. 1351 / 2000

S.C. No. 2/98

సాతం నారాయణమ్మ - పిటీషనర్

Vs.

గున్నా మాలకొండయ్య - రెస్పాండెంట్

TO : గున్నా మాలకొండయ్య, S/o వెంకటయ్య, విశ్వనాథరావుపేట, బోగోలు మండలం, నెల్లూరు జిల్లా

Dismissal for default orderను రద్దు చేయుమని కోరుచు పిటీషను దాఖలు చేసినందున యిందు విషయమై ఆక్షేపణలున్న 2000 సం. 12వ నెల 19వ తేది పగలు 10 గంటలకు ఖుద్దునగాని, వకీలు ద్వారా గాని పై కోర్టులో హాజరై కోర్టువారితో మనవి చేసుకోవలసినది. లేని యెడల సదరు విషయమై నీ పరోక్షమున విచారించి తీర్మానం చేయుదురని తెలియజేయడమైనది.

(By Order of Court)

**D. Subba Reddy,** BA.,BL.,

Advocate for Petitioner

## ఐఎంఏ రాష్ట్ర అధ్యక్షునిగా అశోక్

ఇండియన్ మెడికల్ అసోసియేషన్ రాష్ట్ర శాఖ అధ్యక్షునిగా నెల్లూరీయుడు డాక్టర్ జి.అశోక్ నియమితులయ్యారు. కస్తూరిబా కళాక్షేత్రంలో ఇటీవల జరిగిన 42వ ఐఎంఏ రాష్ట్ర వార్షిక సమావేశంలో ఈ బాధ్యతలు స్వీకరించారాయన. డాక్టర్ అశోక్ వృత్తిరీత్యా చిన్న పిల్లల డాక్టర్, ప్రవృత్తిరీత్యా ఐఎంఏ రాజకీయాలే ఉఛ్వాస, నిఛ్వాసలు. నెల్లూరు ఐఎంఏ శాఖ అధ్యక్షునిగా, కార్యదర్శిగా సుధీర్ఘంగా కొనసాగిన నేర్పరి. చిన్న వయస్సులోనే పెద్ద పదవిని పొందిన డాక్టర్ అశోక్‌కు మా అభినందనలు.

## చీటి ఓనర్ అరెస్ట్

ఓ వ్యక్తి ఆత్మహత్యకు కారకురాలైన చీటి ఓనర్ పి. సుశీలమ్మను 7తేది నెల్లూరు టూ టౌన్ పోలీసులు అరెస్టు చేశారు. నెల్లూరు శెట్టిగుంట రోడ్డుకు చెందిన మాలకొండారెడ్డి, సుశీలమ్మ వద్ద లక్షా 80వేల రూపాయలు విలువ చేసే చీటికట్టారు. ఆమె చివరికి ఆ డబ్బులు ఎగగొట్టడంతో మనోవ్యథతో మాలకొండారెడ్డి విషం త్రాగి ఆత్మహత్య చేసుకొన్నాడు.మరణ వాంగ్మూలంలో తన చావుకు సుశీలమ్మే కారణమని చెప్పడంతో అప్పటి నుంచి ఆమె పరారీలో వుంది. 6తేది పాలిచెర్లపాడులో వుండగా పోలీసులు అరెస్టు చేసి, కోర్టుకు హాజరుపెట్టగా మేజిస్ట్రేట్ ఈనెల 26తేది వరకు రిమాండ్‌కు ఆదేశించారు.

## ఓటర్ల లిస్టులో మార్పు, చేర్పులు

నవంబరు 2తేది నుంచి నెలాఖరు వరకు జరిగిన ఓటర్ల లిస్టు మార్పు, చేర్పుల్లో కొత్తగా 56,723 మంది తమకు ఓటుహక్కు కల్పించమని అధికారులకు దరఖాస్తు చేసుకొన్నారు. పంచాయతీ ఎన్నికల ప్రకటన వెలువడిన నేపథ్యంలో గ్రామీణ ప్రాంతాల్లో ఎక్కువ మంది దరఖాస్తు చేసుకొన్నారు. పట్టణ ప్రాంతాల్లో ఓటర్ల నమోదు కార్యక్రమానికి పెద్ద స్పందన రాలేదు.

## నెల్లూరులో చలి

గతవారంలో కురిసిన భారీ వర్షం నిలచిపోయిన మరుసటి రోజు నుంచి నెల్లూరులో చలి విజృంభించింది. కొత్త వాతావరణానికి నెల్లూరీయులు తల్లడిల్లి పోతున్నారు.

## భార్గవి ఆటోమొబైల్స్ తృతీయ వార్షికోత్సవం

భార్గవి ఆటోమొబైల్స్ తృతీయ వార్షికోత్సవం ఎ.కె.నగర్‌లోని సంస్థ ప్రాంగణంలో 7తేది ఘనంగా జరిగింది. అధ్యక్షత వహించిన నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ భార్గవి ఆటోమొబైల్స్ మర్యాదతో కస్టమర్లను ఆదరించడం వల్ల ఇప్పటికే 12 వందల కార్లు అమ్మగలిగిందన్నారు. రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి మాట్లాడుతూ కార్ల తయారీలో అనేక కొత్త కంపెనీలు వచ్చినా మారుతీ సాంకేతిక పరిజ్ఞానం, భారీ సంఖ్యలో వర్క్ షాపులు లేనందు వల్ల కస్టమర్లకు మెరుగైన సేవలు అందించలేక పోతున్నాయన్నారు. మాజీ ఎమ్పీ మాగుంట శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ భార్గవి ఆటో మొబైల్స్ సిల్వర్ జూబ్లీ జరుపుకొంటుందని తాను ఆ సభలో పాల్గొనాలన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. పారిశ్రామికవేత్త పి.వి. ప్రసన్నరెడ్డి మాట్లాడుతూ దూర ప్రయాణాలకు కూడా మారుతీ కార్లు ఎంతో సౌకర్యవంతంగా వుంటాయన్నారు. ఆటో మొబైల్స్ మేనేజింగ్ డైరక్టర్ కొండా బలరామిరెడ్డి, ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ నిరంజన్‌రెడ్డి భవిష్యత్తులో కస్టమర్లకు మెరుగైన సేవలు అందిస్తామన్నారు. తృతీయ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని కస్టమర్ల పిల్లలకు సంగీతం, చిత్రలేఖనం, పాటల పోటీలు పెట్టి బలరామిరెడ్డి బహుమతులు పంచిపెట్టారు.

## ఇంజనీరింగ్ కాలేజికి శంకుస్థాపన

ఉదయగిరిలో మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఛారిటబుల్ ట్రస్ట్ సైన్స్ అండ్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్‌కు మంజూరైన ఇంజనీరింగ్ కళాశాల భవనాలకు 7తేదీ శంకుస్థాపన జరిగింది. రాజమోహన్‌రెడ్డి సోదరుడు, ట్రస్ట్ కోశాధికారి మేకపాటి చంద్రశేఖరరెడ్డి తన చేతుల మీదుగా ఈ కార్యక్రమాన్ని ఎటువంటి ఆర్భాటం లేకుండా పూర్తి కావించారు.

## నెల్లూరులో టెస్ట్ ట్యూబ్ బేబీ సెంటర్

నెల్లూరు ఆర్టీసి బస్టాండుకు సమీపంలో సామ్రాట్ క్లినిక్ టెస్ట్ ట్యూబ్ బేబీ సెంటర్‌ను ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 7తేది ప్రారంభించారు. నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాల్లో ఇదే మొట్ట మొదటి టెస్ట్‌ట్యూబ్ బేబీ సెంటర్. తమ క్లినిక్ దక్షిణ భారత

కొరవ 7వ పేజీలో

## పునర్వివాహం

2వ పేజీ కొరవ

విడాకులు తీసుకోవడమే కాదు, కుటుంబపరంగా కూడా సంబంధాలు చెడాయి. ఒకరితో ఒకరు మాట్లాడుకొని ఎన్ని నెలలైవుంటుందో తెలియదు. వున్నట్లుండి మామ అల్లుళ్లు పునర్వివాహానికి ఎందుకు పూనుకుంటున్నారో తెలియదు. సంగం బ్యారేజ్ నిర్మాణం కోరుతూ తాను జరపబోయే పాదయాత్రకు రమ్మని పిలవడానికి మొదటగా ప్రసన్నే చంద్ర మోహన్‌కు ఫోన్ చేశాడట. నువ్వు వొకందుకు పోస్తే నేను ఇంకొకందుకు త్రాగుతాను అన్న ధోరణిలో చంద్ర మోహన్ ఆ ఫోన్ పలకరింపును ఒడిసి పట్టుకున్నాడు. ఆ నెపంతో నేరుగా ప్రసన్న ఇంటికి వెళ్లిపోయాడు; కల్సి వుంటే కలదు సుఖం అన్న కథ కమ్మగా విన్పించాడు'; తదుపరి సమాగం నెల్లూరులో రమేష్‌రెడ్డి ఆధ్వర్యంలో జరిగింది; మనమంతా ఒకటైతే ప్రభాకరరెడ్డి జుట్టు పట్టుకుని ఆడించవచ్చు అని తీర్మానించుకున్నారు; హిందీ చీని భాయి భాయి అన్నట్లు ప్రమాణాలు చేసుకున్నారు.

రాజకీయాలలో శాశ్వత శత్రుత్వాలు, శాశ్వత మిత్రత్వాలు వుండవు అని వూరికే అనలేదు. నిన్న మొన్నటి వరకు ఒకరి గొంతు ఒకరు కోయడానికి పథకాలు రచించిన వారు ఈ రోజు కల్సిపోవడం పెద్ద విశేషం కాదు. కాని నిన్నటి వరకు తనకు ఆశ్రయం ఇచ్చిన వారిని నట్టేట ముంచి, నింపాదిగా తిరిగి రావడానికి మాత్రం గుండెలు తీసిన బంట్లు అయి వుండాలి. మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డిని ఈ ఒకటిన్నర ఏడాదిలో నంజుక తిన్నాడు ప్రసన్న. బాతు దగ్గర బంగారు గుడ్లు జీర్ణం కానంతగా ఆరగించాడు. ఇక అక్కడ చిల్లర రాలదని నిర్ధారించుకున్నాడేమో, గుడిసె మీద దెబ్బ కొట్టి ఛలో అనేశాడు.

ప్రసన్న రాజకీయమంతా ధనార్జన పర్వమే. కోవూరులో ఆయన పాతకాలం చక్రవర్తులు సామంతుల దగ్గర కప్పం కట్టించుకున్నట్లు, ప్రతి ఇంజనీరును పిండుక తిన్నాడు. పంచాయతీరాజ్, పిడబ్ల్యుడి, ఆర్ అండ్ బి వంటి శాఖలతో పాటు పోలీసు స్టేషన్ల నుంచి కూడా నెల మామూళ్లు దండే ఘనుడాయన. ఈ విద్య జిల్లాలో మరే ఎమ్మెల్యేకి వంటపట్ట లేదు. అందువల్లే ఎప్పుడు ఎవరి పలుకుబడి బాగావుంటే వారి ప్రక్కన చేరుతున్నాడు. కలెక్టర్ వంటి అధికారులను నెత్తిన పెట్టుకుని పూజిస్తాడు. కలెక్టర్‌ను గ్రామాలకు పిల్చి, స్వాగతం చెప్తూ పత్రికలలో ప్రకటనలు ఇచ్చే ఏకైక ఎమ్మెల్యే, నెల్లూరు జిల్లాలోనే కాదు, రాష్ట్రంలోనే ప్రసన్న ఒక్కడే. ప్రకటనలు వూరికే ఇవ్వడు; ఆ తర్వాత అంతకు నాలుగింతలు కలెక్టర్ల నుంచి పిండడం ఆయనకు బాగా తెల్సిన విద్య. గుండె జబ్బుల వంటి వాటికి ముఖ్యమంత్రి సహాయ నిధి నుంచి ఇచ్చే నిధిని సైతం దొంగ పేర్లతో తీసుకునే నికృష్ట మనస్తత్వం ప్రసన్నది. నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కడుపున పుట్టి ఇంత నీచంగా ప్రవర్తించేందుకు ఆయనకు మనసు ఎట్లా ఒప్పుతున్నదో కాని, సిగ్గు శరం విడిచేసి మరీ దండకాలకు మళ్లుకుని వున్నాడాయన. పాదయాత్ర ప్రహసనం కూడా ఈ చందాల పథకంలో ఒక భాగమే. ఇప్పుడు కొత్తగా ఇల్లు కట్టుకుంటున్నాను, సహాయం చేయండి అని గడప గడప తిరిగి జేబులు నింపుకుంటున్నాడు. స్వర్గాన వున్న శీనయ్య ఆత్మ ఎంతగా ఘోషిస్తున్నదో పాపం! ప్రభాకరరెడ్డితో ప్రసన్న తగువుకు తక్షణ కారణం ఏమిటో అర్థం కావడం లేదు. ఏదో ఒక దురాలోచన లేదా దూరాలోచన లేకుండా తొందరపడే తత్వం కాదు ఆయనది.

ఈ మామా అల్లుళ్ల పునర్వివాహ ఫలితంగా జిల్లా రాజకీయాలలో వచ్చే మార్పు ఏమిటి అన్నది ప్రస్తుత చర్చనీయాంశం. ప్రభాకరరెడ్డికి ఒక అనుకూలత వుంది. ఏమీ మాట్లాడడు, ఎందుకూ చలించడు. రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు అవుతాయి; అట్లా చేతులు కల్పడం ఆయన తత్వం కాదు. అందువల్ల కొంత కాలం ఈ మార్పు ఫలితం జిల్లాలో పెద్దగా కన్పించక పోవచ్చు. ఇప్పటికి ఇప్పుడు జిల్లాలోని తతిమా ఎమ్మెల్యేలందరూ మంత్రితోనే వున్నారు; జిల్లా అధ్యక్షుడు వై.ఎస్.ఆర్ సరే సరి; పాత అధ్యక్షుడు వేనాటి మునిరెడ్డి వంటి వారికి చంద్రమోహన్ అంటే భయం - వారు మంత్రిని వదలి పెట్టరు; కొమ్మి లక్ష్మయ్య నాయుడు వంటి వారు కూడా ఇప్పటికిప్పుడు గోడ దూకే పిల్లివాటం ప్రదర్శించరని భావించవచ్చు.

ఏమి జరిగినా హైదరాబాద్‌లోనే జరగాలి. ముఖ్యమంత్రి మంత్రులకంటే ఎమ్మెల్యేలకు ఎక్కువ విలువ ఇస్తాడు. అది ఆయన రాజకీయ అవసరం. లోపల ఎంత కష్టం వున్నా ఎమ్మెల్యే వస్తే మాత్రం తియ్యగా మాట్లాడి పంపడం అలవాటు. ఒకరికి ఇద్దరు ఎమ్మెల్యేలు ఒకటైనప్పుడు సహజంగా వారికి ముఖ్యమంత్రి దగ్గర చొరవ పెరుగుతుంది. అయితే వీరిద్దరి సంగతి చంద్రబాబుకు తెల్సినంతగా మరెవ్వరికీ తెలియదు. అందువల్లనే ఆయన సీనియర్ అనే అర్హత ప్రక్కన పెట్టి, జూనియర్ ప్రభాకరరెడ్డికి మంత్రిత్వం ఇచ్చింది. ఈ దృష్టితో చూసినప్పుడు వీరు చెప్పే చాడీలకు విలువ ఎంత వుంటుందో వూహించుకోవచ్చు. పెంచలరెడ్డి విషయంలోనే అది రుజువయ్యింది కదా? నిన్నటి వరకు చంద్రమోహన్ రెడ్డిపై ఫిర్యాదులు విన్పిస్తుండిన ప్రసన్న కుమారరెడ్డి ఇప్పుడు అదే చంద్ర మోహన్‌రెడ్డితో కల్సి ప్రభాకరరెడ్డిపై చాడీలు చెప్తే ముఖ్యమంత్రి వింటాడా? చంద్రమోహన్ కాంగ్రెస్ టిక్కెట్‌పై పోటీ చేసిన జె.కె.రెడ్డితో సిండికేట్‌గా ఏర్పడి కాంట్రాక్ట్ పనులు చేస్తున్నాడని నేరుగా ముఖ్యమంత్రికి పిటిషన్ ఇచ్చిన వాడు ప్రసన్న.

ఈ మామ అల్లుళ్ల పునర్వివాహం వల్ల జిల్లా రాజకీయాలపై ప్రభావాలు ఎట్లా వుండినా, జిల్లా ప్రజలకు మాత్రం ఇక నుంచి మహా గొప్ప కాలక్షేపం. తిట్లు, ప్రతి తిట్లు ప్రతిరోజూ పత్రికలలో చదువుకుని ఆనందించవచ్చు మనం. రమేష్‌రెడ్డి వీరితో కలిశాడు కాబట్టి సందడికి కొదవే వుండదు. అసలే కోతి, ఆపై కల్లు తాగింది, పొరపాటున నిప్పు తొక్కింది అన్నట్లు వుంటుంది ఇక నుంచి రమేష్‌రెడ్డి ప్రవర్తన. ఇంత కాలం ఆయనకు తోడులేరు. మంత్రి పెట్టే ఈతి బాధలు అనుభవించడం, ఇంట్లో కూర్చొని కుమిలి కుమిలి ఏడ్వడం తప్ప చేయగల్గింది ఏదీ లేదు. హైదరాబాద్‌లో తలుపులు మూతపడడంతో రైల్కెక్కడమే మానుకున్నాడు. ఇప్పుడు చంద్రబాబు చెవికి తన వాదం విన్పించే వారు దొరికారు; అంతకంటే ఆనందం ఏమి వుంటుంది. అందువల్లనే తన బావమరిది ఇంట పెళ్లి మండపాన్ని, చంద్రమోహన్, ప్రసన్న రెడ్డిల పునర్వివాహ వేదికగా మార్చి సంబరం చేసుకున్నాడు.

## రైతుల ఉసురు

మొదటి పేజీ కొరవ

పిప్పించుకోవడం లేదు. కనీసం రోజులో ఆరు గంటల పాటు కరెంట్ సరఫరా చేసినా ఎండి పోతున్న పైర్లు బ్రతికించు కోవచ్చు. కాని పట్టుమని రెండు గంటలు కూడా సరఫరా సక్రమంగా లేదు. అర గంటకు ఒకసారి తీసి మళ్లీ ఇస్తున్నారు. దీనివల్ల మోటార్లు కాలి పోతున్నాయి; అరగంటలోపల మోటార్ ఆగిపోతుం డడంతో నీళ్లు పొలానికి చేరక ముందే ఇంకి పోతున్నాయి. శ్రమ తప్ప పైర్లు బ్రతకడం లేదు.

రైతులకు ఇంత కష్టం ఇటీవలి కాలంలో లేదు. కాంగ్రెస్ నేతల ప్రయత్నా లను ఎగతాళి చేయడం తప్ప పరిస్థితిలో మార్పుకు ఆలోచన చేయడం లేదు ముఖ్యమంత్రి. ప్రజలను మభ్యపెట్టడానికి ప్రయత్నాలు మాత్రం చేస్తున్నాడు. మార్కెటింగ్ యార్డ్ అధికారులను తిట్ట డం, ఆగ్రహం వ్యక్తం చేయడం తప్ప ఈ పర్యటనల వల్ల ఫలితం కన్పడడం లేదు. ఎఫ్‌సిఐ కొనుగోలు ప్రారంభించే వరకు మార్కెటింగ్ యార్డ్‌లలోని రాష్ట్ర ప్రభుత్వ గోడౌన్లలో ధాన్యం నిల్వ చేసి, రైతులకు ఆర్థిక సహాయం చేయవచ్చు. కాని ఆరు నెలల క్రితం ఆర్భాటంగా జరిపించిన నీరు - మీరు కార్యక్రమానికి మార్కెటింగ్ నిధులను వాడేసింది రాష్ట్ర ప్రభుత్వం. రైతులకు సంబంధించిన ఆ నిధి వాడడానికి లేదని, అది రాజ్యాంగ విరుద్ధమని అప్పటి చీఫ్ సెక్రటరీ అభ్యం తరం చెప్తె, ఆయన్ను రాత్రికి రాత్రి ఆ పదవి నుంచి తీసి పారేశాడు ముఖ్య మంత్రి. ఇప్పుడు మార్కెటింగ్ శాఖ బొక్కసం ఖాళీ; రైతులకు అవసరం వచ్చేసరికి చిల్లి గవ్వ లేదు. ఆ డబ్బు తాకకుండా వుండి వుంటే కనీసం కొందరు రైతులైనా ఉపశమనం పొంది వుండేవారు.

రైతుల ఆత్మహత్యలు పెరిగి పోతు న్నాయి. ఈ పదకొండు నెలల్లో 350 మందికి పైగా ఆత్మహత్యలు చేసుకు న్నారని అంచనా. ఎంతో ఘోరమైన విషయం ఇది. కాని ప్రభుత్వంలో కదలిక లేదు. కనీసం చచ్చిన రైతు శవ దహ నానికి కూడా సహాయం చేయడానికి ముందుకు రావడం లేదు. ఆత్మహత్యలు చేసుకున్న వారి కుటుంబాలకు ధన సహాయం చేస్తె, మరింత మంది ఆత్మ హత్యలకు పాల్పడుతారన్న వాదం లేవదీసి, రైతులు వారి చావు వారు చావవల్సిందే తప్ప తాము చేయగల్గింది ఏమీ లేదని తేల్చి చెప్పేశారు వ్యవసాయ మంత్రి శోభనాద్రీశ్వరరావు గారు.

ఇంతగా రైతులను క్షోభకు గురి చేస్తున్న ఈ ప్రభుత్వానికి, ఈ నేతలకు రైతు కుటుంబాల ఉసురు తగిలి తీరుతుంది.

**కోవూరు సీనియర్ సివిల్ జడ్జి కోర్టు**

E.P. No. 11 / 2000

O.S. No. 196 / 86

స్టేట్ బ్యాంకు ఆఫ్ హైదరాబాదు, ఉస్మాన్ సాహెబ్ పేట, నెల్లూరు – DHr.

Vs.

శ్రీ మల్లికార్జున పర్లైబర్స్ స్టోన్‌హౌస్ పేట, నెల్లూరు, rep. by Rapuru Ramana Reddy (died), s/o Raghavareddy, Nellore and others ... JDrs,

**రెస్పాండెంట్లు 7 to 9 కి వారసు పిటీషనుపై నోటీసు**

7th Respondent :- Kaluvayi Subbamma, w/o Venkat Reddy, Near Darga, Balaji Nagar, Nellore.

8th Respondent :- Pathipati Kamalamma, w/o Penchalaiah, Varikuntapadu, Nellore Dist.

9th Respondent :- Byravarapu Subbamma, w/o Venkatasubba Reddy, 4th Road, Banjara Hills, Hyderabad.

పై నంబరున కాకూరు వెంకట రెడ్డి చనిపోయినందున అతని వారసులను చేర్చుటకు దాఖలు చేసిన పిటీషనులో మీకు నోటీసు నిమిత్తం 26.12.2000 తేదికి వేసినారు. ఆ తేదిన పై కోర్టులో ఉదయం 10.30 గంటలకు హాజరై మీ అక్షేపణలు తెలుపుకోవలసినది. లేని యెడల మీ పరోక్షమున తీర్మానించెదరు.

ఉదాలి సుబ్రహ్మణ్యం, బి.ఏ.,బి.ఎల్.
DHr అడ్వకేటు

## సిడబ్ల్యూసి

2వ పేజీ కొరవ

సిఎల్‌పి నాయకుడు వేరొక జాబితా సమర్పించారు. కోట్ల విజయభాస్కరరెడ్డి, ఎన్.జనార్దనరెడ్డి తమ పేర్ల చిట్టా ఇచ్చి వచ్చారు. చిల్లర చిల్లరగా శివశంకర్, హనుమంతరావు వంటి వారు కొన్ని పేర్లు ఇచ్చారు. వీటిలో ఎవరి జాబితాకు అధిక ప్రాధాన్యత వుంటుంది అన్న విషయం వూహించడం కష్టంగా వుంది. సోనియా గాంధీ నేరుగా వీటికి టిక్కులు పెడుతుందా, లేక మోతిలాల్‌వోరా వంటి వారి సలహా తీసుకుంటుందా అన్న విషయం తేలడం లేదు. సోనియా నేరుగా ఎంపిక చేసే పక్షంలో జార్జి వంటి అంతేవాసులు ఎవరిపట్ల ప్రసన్న దృక్కులు ప్రసరింపచేస్తే వారికి అవకాశం. *

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

దేశంలోనే అతిపెద్ద సంతాన సాఫల్య కేంద్రమని నిర్వాహకులు డాక్టర్ సుధాకర్, డాక్టర్ విజయలక్ష్మి చెబుతున్నారు. ఈ క్లినిక్ ప్రారంభోత్సవ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, జాయింట్ కలెక్టర్ ఎస్.ఎస్.రావత్ పాల్గొన్నారు.

### ఎంటెక్ ఎంట్రన్స్‌లో కలిచేడు విద్యార్థి ఫస్ట్

హైదరాబాద్‌లోని జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్శిటీ నిర్వహించిన ఎంటెక్ (ఎన్విరాన్‌మెంటల్ మేనేజిమెంట్) ఎంట్రన్స్‌లో సైదాపురం మండలం కలిచేడు గ్రామానికి చెందిన మీరా సుభాన్ రాష్ట్ర స్థాయిలో మొదటి ర్యాంకు సాధించాడు. మీరా సుభాన్ ఎటువంటి కోచింగ్ తీసుకోకుండా స్వంతంగా ఇంట్లోకూర్చొని చదివి ఈ ర్యాంకు పొందడం హెచం. కలిచేడు ఉన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయుడు షేక్ మస్తాన్ సాహెబ్ కుమారుడైన మీరాసుభాన్ తాను మొదటి ర్యాంకు సాధించడానికి తండ్రి ప్రోత్సాహమే కారణమన్నాడు. గట్టి కృషి చేస్తె తప్పక ఫలితం సాధిస్తారనే దానికి మీరాసుభాన్ చక్కని ఉదాహరణ.

### డివిజనల్ పిఆర్వోగా నరసింహారావు

జిల్లా పౌర సంబంధ శాఖ కార్యాలయంలో కష్టజీవి, ఎపిఆర్‌ఓ పి.నరసింహా రావుకు పదోన్నతి లభించింది. ఆయన్ను డివిజనల్ పిఆర్వోగా తెనాలిలో నియ మించారు. ఈ సందర్భాన్ని పురస్క రించుకొని 6తేది పౌరసంబంధ శాఖా ధికారి కార్యాలయంలో అభినంద సభ జరిగింది. పౌరసంబంధ శాఖ రీజినల్ డిప్యూటీ డైరక్టర్ జాన్సన్, డిపిఆర్వో ఎం.వెంకటరత్నం, పాత్రికేయులు ఆర్.ఎం.బాషా, రామ్మోహన్, అల్లూరు రహీం, కృష్ణారావు, జయప్రకాష్, చలపతి, డివిజనల్ పిఆర్వో ఖాన్ తదితరులు మాట్లాడారు. చివరన నరసింహారావు కృతజ్ఞతలు చెబుతూ కన్నీళ్ల పర్యంత మయ్యారు. నరసింహారావు భవిష్యత్తులో మరింత ఎదగాలని జమీన్‌రైతు ఆకాంక్షిస్తోంది.

### జిల్లా అభివృద్ధి మండలి సమావేశం

నెల్లూరు జిల్లా అభివృద్ధి మండలి సమావేశం 17తేది గోల్డన్ జూబ్లీ హాల్‌లో జరుగుతుంది. జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి చిక్కాల రామచంద్రరావు ఈ సమావే శానికి అధ్యక్షత వహిస్తారని జిల్లా కలెక్టర్ కె.ప్రవీణ్‌కుమార్ చెప్పారు.

### పోస్టల్ సమ్మె

తపాలా ఉద్యోగుల ఐక్య కార్యా చరణ సమితి దేశవ్యాప్త పిలుపు మేరకు 5తేది నుంచి జిల్లాలోని తపాలా ఉద్యో గులు నిరవధిక సమ్మెలో పాల్గొంటు న్నారు. నెల్లూరు, కావలి, గూడూరు డివిజన్లలోని ప్రధాన తపాలా కార్యాల యాలు, 80 పోస్టాఫీసులు, 750 బ్రాంచి పోస్టాఫీసులు, ఆర్‌ఎంఎస్ కార్యాలయాలు ఒక్కసారిగా మూతపడడంతో ఉత్తరాల బట్వాడా, ఇతర లావాదేవీలు నిలచి పోయాయి.

పోస్టల్ సమ్మె మూలంగా కొరియర్ సర్వీసుల బుకింగ్ పాయింట్లు కిటకిట లాడుతున్నాయి.

### డాక్టర్ ఎస్.ఎస్.రెడ్డికి మాతృవియోగం

నెల్లూరులో చేయి తిరిగిన సర్జన్ డాక్టర్ ఎస్.ఎస్.రెడ్డి తల్లి సిద్దారెడ్డి రాజేశ్వరమ్మ (77) నవంబరు 27తేది నెల్లూరులో మరణించారు. ఆమెకు ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు. వీరి కుటుంబానికి మా సానుభూతి.

**జమీన్‌రైతు చందా**

| | |
|---|---|
| సంవత్సరానికి | రూ.100లు |
| విదేశాలకు | రూ.650లు |

అడ్రస్సు

కాశిభోట్ల అగ్రహారం, పొగతోట
నెల్లూరు, ఫోన్: 327354

**జమీన్‌రైతు**
తెలుగు వార పత్రిక

**అభిమాన పత్రికతో అందుకోండి అద్భుతకానుక**

**జమీన్‌రైతు చందాదారులందరికీ నూతన సంవత్సర బహుమతి**

జమీన్‌రైతు వారపత్రికకు ఇప్పటివరకు వున్న చందాదారులందరికీ, కొత్తగా చందాదారులుగా చేరే వారికి నూతన సంవత్సర కానుకగా **నిప్పో ఫ్లాష్ టార్చిలైట్** అందజేయ బోతున్నాం. **2000 డిసెంబర్ 1 తేది నుంచి 2001 మార్చి 31 తేది** లోపల చందాదారులుగా చేరే వారందరికీ ఈ కానుక అందుతుంది.

**రూ.100ల చందాతో ఏడాదిపాటు జమీన్‌రైతు**

**అదనంగా అంతే విలువకల్గిన నిప్పో ఫ్లాష్ టార్చిలైట్**

**మీరు చేయవలసిందల్లా ...**

- రూ.100లు చెల్లించి జమీన్‌రైతు చందాదారులుగా చేరండి.
- మీకు గాని, మీరు సూచించిన మీ స్నేహితులు, బంధువులకు కాని వారు దేశంలోని ఏ నగరంలో వున్నాసరే వారం వారం జమీన్‌రైతు సరఫరా జరుగుతుంది.
- అదనంగా రూ.100లు విలువ గల నిప్పో ఫ్లాష్ టార్చిలైట్ కానుకగా అందజేయ బడుతుంది! అంటే మీరుచెల్లించే చందామొత్తం మీకు తిరిగి వచ్చేస్తుందన్నమాట, పత్రిక ఉచితమని అర్థం!
- 1.12.2000 నుంచి 1.4.2001 మధ్య చందాదారులుగా చేరే కొత్తవారికి, రెన్యువల్ చేసుకొనే పాత చందాదారులకు కూడా కానుకలు అందజేయబడుతాయి.
- తమ బంధువులు, స్నేహితుల కోసం ఒకరు ఎన్ని చందాలైనా చెల్లించవచ్చు. వారందరికీ పత్రిక పంపుతాము. కానుకా అందజేస్తాం! ఇతర నగరాలు, రాష్ట్రాలలో వుండే వారికి పత్రిక పోస్ట్ ఖర్చులు కూడా మేమే భరిస్తాం!
- చందా చెల్లించిన వెంటనే రశీదుతో పాటు కానుక అడిగి తీసుకోండి, ఇతర ప్రాంతాల నుంచి ఎం.ఓ. లేదా డి.డి. ద్వారా చందా పంపేవారు మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కానుక స్వీకరించాలి. కానుకను పోస్టులో పంపడం సాధ్యం కాదు.

**సాహసోపేత వాస్తవ వార్తాచిత్రిక**
**జమీన్‌రైతు పత్రిక**

# వాస్తులో 'ఆయం' మాయం!

విజ్ఞాన శాస్త్రం ముందడుగు వేస్తున్న కాలంలో ఛాందసం వెర్రి వేయితలలు వేస్తూనే వుంది. ప్రామాణికమైన కాల పరిస్థితులను బట్టి శాస్త్రాల్ని సవరించి మదించాల్సిన అవసరం కూడా ఏర్పడిందిప్పుడు.

వాస్తులో 'వర్గు' లాగానే 'ఆయం' ఓ ఛాందసం. ఇంకా చెప్పాలంటే అదో 'తికమక'. రాజ భవనాల కోసం ఏర్పడిన ఆయం కాలగతిలో గృహస్థు మనసులపై తీవ్రమైన ముద్ర వేసింది. 'ఆయం' వల్ల గృహజనుల జీవన ప్రమాణాలు, ఆరోగ్యాలు చెక్కుబడుతాయని, ఇంటి జీవితకాలం నిర్ణయించబడుతుందనే నమ్మకం బాగా ప్రబలిపోయింది. అయితే 'ఆయం' వైశిష్ట్యం, ప్రభావం, ప్రయోజనాల్ని గురించి చూద్దాం.

### 'ఆయం' అంటే

ఆయం అంటే 'గర్భం' అని అర్థం. గర్భం గృహం పొడవు, వెడల్పుల గుణకారాన్ని 'ఆయం' అంటారు. ఈ ఆయం విషయంలో వున్న గందరగోళాన్ని చూద్దాం. గది ప్రమాణాల్ని, గృహస్థు

## వాస్తుసంగతులు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి

లేదా అతని ప్రథమ భార్య, ప్రథమ పుత్రుడు హస్త ప్రయాణాలతో గాని, కనీసం మేస్త్రి కర ప్రమాణం (కర్ర)తో గాని కొలవాలని శాస్త్రాల్లో రాశారు. అందరి చేతుల ప్రమాణాలు ఒకటిగా ఎట్లా వుంటాయి? వివిధ ప్రమాణాల వల్ల 'ఏకసూత్ర' ఆయం ఎట్లా వస్తుంది?

మన శాస్త్రజ్ఞుల 'తికమక' కూడా చూద్దాం. ఇంటి 'గర్భం' కొలతలో ఒక్కొక్కరిది ఒక్కొక్క సిద్ధాంతం. ఇంటి లోపలి ప్రమాణాల్ని తీసుకోవాలని కొందరు, కట్టుబడి గోడతో సహా లెక్క తీసుకోవాలని మరికొందరు వాదిస్తున్నారు. పాత కాలంలో 24 అంగుళాలు, నేడు 18, 16 అంగుళాలలోనూ (రాయలసీమ, తెలంగాణా తెల్లరాళ్లు), ఇటుక రాళ్లయితే 14 లేక 9 అంగుళాలతో, అరగోడలైతే 6 అంగుళాలతో నిర్మిస్తున్నారు.

వీటిలో ఏ ప్రమాణాల్ని తీసుకోవాలి? అనే విషయంలో ఎవరూ నిర్దుష్టంగా చెప్పడం లేదు. ఇలా పద్ధతి లేని 'ఆయం' గృహస్థుకు ఎంత వరకూ అందిస్తుంది న్యాయం?

### 'ఆయం' ఎట్లా వస్తుంది?

గది పొడవు వెడల్పులను గుణించి దాన్ని 9చేత హెచ్చించి వచ్చిన లబ్ధాన్ని 8చేత భాగిస్తే వచ్చిన శేషాన్ని 'ఆయ స్థానం' అంటారు. ఈ స్థానాలు 8 రకాలుగా వుంటాయి.

ఇలా గుణిస్తే 1 వస్తే ధ్వజాయం, 2 ధూమాయం, 3 సింహాయం, 4 శ్వానాయం, 5 వృషభాయం, 6 ఖరాయం, 7 గజాయం, 8 కాకాయం.

### ఏ గది ఏ ఆయం!

తూర్పు స్నానపు గది ధ్వజాయంలో నిర్మించుకోవాలి. ఆగ్నేయం ధూమాయంలో వంటగది, దక్షిణం పడక గది సింహాయంలో, నైరుతి ఆయుధాల గది శునకాయంలో, పడమర వృషభాయంలో భోజనశాల, ఉత్తర గజాయంలో ఖజానా, ఈశాన్యం కాకాయంలో పూజా గది నిర్మించు కోవాలట.

### రాశుల ఫలితం

రాశులను బట్టి ఫలితాలుంటాయన్నది మరొక వితండ వాదం. అదీగాక మకర, సింహ, వృషభ రాశుల వారు గ్రామం మధ్యలో గృహాలు నిర్మించకూడదన్నది మరొక శాసనం.

వాస్తులో ఇన్ని ఛాందసాలుంటే ఎవరైనా ఎట్లా ఇల్లు కట్టగలరు? అథవా కట్టినా మానసికంగా ఎట్లా బతికి బట్టకట్టగలరు?

(కొరవ వచ్చేవారం)

---

## ఎం.ఇ.ఓ.

5వ పేజీ కొరవ

ప్రస్తుతం 7వ తరగతి విద్యార్థుల భవిష్యత్తు ప్రశ్నార్థకంగా తయారైంది. అలాగే వడ్డిపాళెం యు.పి. స్కూలికి ఒక టీచర్‌ను డిప్యూటేషన్ మీద వేయమని గ్రామసర్పంచ్, విద్యా కమిటీ ఛైర్మన్ ఎన్నిసార్లు కోరినా ఫలితం శూన్యం. ఎం.ఇ.ఓ పిల్లల భవిష్యత్తును ఏవిధంగా నాశనం చేస్తున్నాడో ఈ సంఘటన రుజువు చేస్తుంది. ఇస్కపాళెం పంచాయతి పరిధిలోగల బాలకృష్ణ గిరిజన కాలనీ పాఠశాలలో ఇద్దరు ఉపాధ్యాయులుండగా వారిలో ఒక లేడీ టీచరు జూన్ 13 నుంచి అక్టోబరు 13 వరకు ప్రసూతి సెలవులో వున్నారు. మిగిలిన రెండవ ఉపాధ్యాయుడు ఆ పాఠశాలలో బోధించాల్సిన పరిస్థితిలో వుండగా అతన్ని కూడా ఎం.ఇ.ఓ జూన్ 13 నుంచి నేటి వరకు తనతోపాటు త్రిప్పుకొనేందుకు లేనిపోని ఆన్‌డ్యూటీలు యిచ్చినట్లు తెలిసింది. దీనికి ప్రత్యేక నిదర్శనంగా జూన్ 13 నుంచి ఆ పాఠశాలకు దాదాపు 12 మందిపైనే ఇతర ఉపాధ్యాయులను డిప్యూటేషన్‌పై నియమించినట్లు వారు చేసిన సంతకాల రిజిష్టర్ చెబుతోంది. రోజుకొక టీచరు ఆ పాఠశాలకు వెళ్లి బోధిస్తే పిల్లలకు ఏమి అర్థమవుతుంది. రాష్ట్ర ప్రభుత్వం ఒక పక్క అక్షర జ్ఞానాన్ని పెంచేందుకు అక్షర సంక్రాంతులు నిర్వహిస్తుండగా, ఇచ్చి ఎం.ఇ.ఓ మాత్రం ఉపాధ్యాయులను పాఠశాలలకు వెళ్లనీయకుండా ఆన్‌డ్యూటీలు తన వెంట తిప్పుకోవడం ఎంత వరకు సమంజసం ? ఈ అధికారి చేసిన తప్పుడు పనులను కప్పి పుచ్చుకొనేందుకు విద్యాశాఖాధికారులకు చేపలు, రొయ్యలు యిచ్చి మంచి చేసుకొంటున్నట్లు వినికిడి. చేపలు, రొయ్యలిస్తే చేసిన తప్పులు మాఫీ చేసే విద్యాశాఖాధికారులు వుండడం ఆ శాఖకు పట్టిన దరిద్రమేననాలి.

## మంత్రిమాటలు నీటిమూటలేనా?

వెంకటగిరి ప్రాంతంలో క్షామ పరిస్థితులు ఏర్పడిన సందర్భాన్ని పురస్కరించుకొని నవంబర్ 22తేది ఈ ప్రాం తంలో భారీ నీటిపారుదల శాఖా మంత్రి మండవ వెంకటేశ్వరరావు పర్యటించారు. అక్కడి 3,4,5 తెలుగు గంగ బ్రాంచి కాలువల ద్వారా నీటిసరఫరాకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చారు. రైతులు గ్రామాల వారీగా డబ్బు వసూలు చేసుకొని కాల్వ వలు రిపేర్లు చేయించుకొని చెరువులకు గంగనీళ్లు పెట్టుకొంటున్నారు. ఈ సందర్భంగా వెంకటగిరి కైవల్యానదిపై వున్న అక్విడెక్ట్ నుంచి గంగనీరు కైవల్యా నది గుండా గూడూరుకు తీసుకపోవ డానికి ఎమ్మెల్యే దుర్గాప్రసాద్ నీటిపారు దల శాఖా మంత్రిని ఒప్పించి ఆయన చేత టెంకాయ కొట్టించారు. ఇక్కడే గంగనీళ్లు కైవల్యా నది గుండా గూడూరుకు సరఫరా చేస్తామని మంత్రి ప్రకటించారు. కాని ఎవరికి చుక్కనీరు కూడా వదిలే ఆలోచన అధికార్లు చేయలేదు. ఇదేమిటని అడిగితే కైవల్యానది గుండా గూడూరుకు నీరు చేరాలంటే అక్విడెక్ట్ నుంచి 800 క్యూసెక్కుల నీటిని వదలాలని అంత నీరు వదిలే ప్రసక్తి లేదని అధికారులు చెబుతున్నారు. ఈ నీటిని వదిలితే బాలాయపల్లి చెరువు నిండడంతోపాటు ఎన్నో ప్రాంతాలకు నీరు సరఫరా చేయవచ్చు. మంత్రి మాటను నీటిమూట చేసిన అధికారులను ఏమనాలో అర్థం కావడం లేదు.

## అవినీతి వధ

-గ్రిద్దలూరు గోపాలరావు

అతను
భయపడుతున్నాడు
వణికిపోతున్నాడు
అవినీతిపరులకు
ఎంతటివారికైనా
మరణశిక్ష విధిస్తారట
చైనా దేశంలో
ఇటీవల నిలువునా
కాల్చిచంపారట
ఇద్దరు అవినీతి అధికార్లను
అవినీతి వధకోసం
ఆ చట్టాన్ని అమలుచేస్తే
మన దేశంలో
అవినీతిని ఆరాధిస్తున్న
ముందుగా అతనికి
కుటుంబంలో అందరికీ
మరణశిక్ష విధిస్తారని
భయపడుతున్నాడు

అయ్యా!
భయపడకయ్యా
మనది ప్రజాస్వామ్యంలే
అవినీతి విచ్చలవిడిగా
రాజ్యమేలుతున్నా
అది ముఖ్యకారణంగా
అభివృద్ధి పథకాలు
ఆర్థిక సంస్కరణలు
అనర్థంగా నీరుకారుతున్నా
మరణశిక్ష విధించరులే
మందలించి వదిలేస్తారులే
పెరిగిపోతున్న అవినీతిని
అంతమొందించాలని అదుపు
చెయ్యాలని
ప్రయత్నాలు చెయ్యనక్కరలేదులే
దేశం బాగు ఎవడికి కావాలిలే
ధైర్యంగా వుండు
స్టేటస్ పెరిగేట్టుచూడు
ప్రతిదేశంలో
ఫైవ్‌స్టార్ హోటల్
నిర్మించేయ్
విదేశీ బ్యాంకుల్లో
విరివిగా డబ్బుదాచేయ్.

వర్ధమాన సమాజం ఏర్పాటు చేసిన మహాభారతోపన్యాసాల్లో భాగంగా ఆదిపర్వంపై మాట్లాడిన పాతాల వెంకటకృష్ణయ్యను సన్మానిస్తున్న ఎం. ధర్మారెడ్డి, ప్రక్కన శ్రవన్‌కుమార్, వెంకురెడ్డి, బ్రహ్మయ్య, రామసుబ్బారెడ్డి, రాజసింహ.

# జీవితాన్ని స్మరించే చిత్రిక 'ప్రవాహం'

**గ్రంథ సమీక్ష**
ప్రవాహం నవల
రచయిత్రి
శ్రీమతి జయప్రద
సమీక్షకుడు
పాయసం సుబ్రహ్మణ్యం
ప్రతులకు: వంశీ పబ్లికేషన్స్,
ఇందిరాభవన్ రోడ్, నెల్లూరు -1
వెల: 70/-రూ.లు

శ్రీమతి జయప్రద రచనల్లోని 'మంత్రశక్తి' జీవితాల్ని లోతుగా స్పృశించడం. ఆ శక్తి ఆవిడను రచయిత్రిగా నిలబెట్టింది. పాతికేళ్లనాడు రాసిన ఈ నవల నిత్యనూత్నంగా ఈ కాలానికి తగ్గదిగా వుందని ఆవిడ అన్నప్పుడు ఆమెలోని స్థిర నిబిడీకృత విశ్వాసానికి (Stedily confidence) కాస్తంత ఆశ్చర్యం వేస్తుంది.

స్వతహాగా 'రచయితల' మానసిక తత్వం రచనల్లో ప్రతిబింబిస్తుంది. అదీ సున్నిత మనస్కులైతే రచనా సంవిధానంలో మరింతగా లీనమై పోతారు. అలాంటివారు పాత్రలు ఏడిస్తే తామూ ఏడుస్తారు. ఇటువంటి రచనలు పాఠకుల్ని విచలితుల్ని చేస్తాయి. మానసిక స్థితిని 'కరుణరసం' ప్రపూరితం చేస్తాయి. ఆ కోవకు చెందిన మనసున్న సుకుమార హృదయపు రచయిత్రి శ్రీమతి జయప్రద.

దుక్కానిలేని స్త్రీ వ్యథాపూరిత జీవితాలకు ఓ 'ఆశల' హస్తం చేయూత లభ్యమైతే ఆ జీవితాలు ఎంతగా సేద తీరుతాయో, 'ప్రవాహం' నవలలో విశ్లేషణ పూర్వకంగా ప్రదర్శించారు రచయిత్రి.

ఈ నవలలోని దీప, విరించి, కృష్ణమూర్తి, కృష్ణవేణి, సత్యమూర్తి పాత్రలు నిత్యజీవితంలో మనకు కనిపిస్తూ వుంటాయి.

నవలా పఠనం తగ్గిపోయింది. పబ్లిషర్స్ చేతులెత్తేశారు. రచయితల పేరు క్రేజీ గంగలో కలిసిపోయింది. ఇట్లాంటి పరిస్థితుల్లో రచయిత్రి ధైర్యంగా తన నవలల్ని మార్కెట్‌లోకి పంపడం ఆమెకు తన రచనల పట్ల వున్న ధీమాను తెలియజేస్తోంది. పుస్తకాల ఆదాయంతో విధివంచితులైన అంగ వికలురకు సేవ చేయాలన్న ఆమె ఆలోచన అభినందనీయం.

## వాగ్దానాలు మరచిన ఎమ్మెల్యే

ఆత్మకూరు గ్రామంలో మంచినీటి సరఫరా మెరుగుపర్చను తన కోటా నుంచి నిధులు మంజూరు చేస్తానని నెల్లూరు ఎమ్మెల్యే డాక్టర్ వుక్కాల రాజేశ్వరమ్మ చేసిన వాగ్దానాన్ని మర్చిపోయినట్లున్నారు. ఎమ్మెల్యేగా గెలిచాక ఆత్మకూరు తన పుట్టినిల్లు కాబట్టి ఇక్కడ మంచినీటి పరిష్కారానికి పెన్నా నది నుంచి 7 కిలో మీటర్ల దూరం పాటు పైప్‌లైన్ వేసేందుకు కోటి రూపాయల నిధులు మంజూరు చేయిస్తానన్నారు. పంచాయతీ మంచినీటి పథకానికి రెండు మోటార్లు కొనిస్తానన్న విషయాన్ని కూడా ఎమ్మెల్యే మరచిపోయారు. ఎమ్మెల్యే ఈసారి ఆత్మకూరు వస్తే ఈ విషయమై నిలదీయాలని ప్రతిపక్షాలు రంగం సిద్ధం చేసుకొంటున్నాయి.

# నష్టం చేయను, కష్టం కలిగించను

తెలుగులో కొన్నాళ్లపాటు ఒక వెలుగు వెలిగిన సాక్షి శివానంద్ ప్రస్తుతం తమిళ చిత్రాల్లో విరివిగా నటిస్తోంది. చెప్పిన సమయానికి షూటింగుకు రాక నిర్మాతలను ఇబ్బంది పెదుతుందన్న అపవాదు సాక్షి మీదుంది. అయితే ఆమె మాత్రం ఒప్పుకోవడం లేదు. ఒక చిత్రాన్ని అంగీకరించిన తర్వాత దానిని

## సాక్షి శివానంద్

పూర్తి చేసే ఇవ్వడంలో ఎప్పుడూ పొర పాటు చేయలేదు. సమయానికి రావడం లోనూ, మోతాదుకు మించని ఎక్స్‌పోజింగ్‌లోనూ, కాల్షీట్స్ విషయంలోనూ తన వల్ల ఏ నిర్మాతకూ సమస్యలు రానివ్వనంటూంది. సినిమా అనేది అన్ని చేతులు కలిస్తేనే పూర్తయ్యే సమిష్టి కృషి అని తనకు తెలుసునని, ఇందులో ఎవరు సమస్యలు సృష్టించినా, ప్రధానంగా చిత్రమే బాధింపబడుతుందని చెప్పింది.

### ప్రేమించడం నేర్చుకోండి

మనసులో మాట, మా బాలాజీ, అన్నయ్య చిత్రాల్లో నటించిన పదహారణాల తెలుగమ్మాయి శివ్య ప్రస్తుతం శివుడు చిత్రంలో హీరోయిన్‌గా నటిస్తోంది. షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. తాను బొట్టు పెట్టుకోకుండా మోడ్రన్ డ్రస్సులు వేస్తే మోడ్రన్ గర్ల్‌లా కనిపిస్తానంది. లంగా, ఓణిలో అయితే తెలుగు ఆడపిల్లలా వుంటానంది. ఇప్పటి వరకు తనకు ఎవరూ ఐలవ్‌యూ చెప్పలేదంది. చదువుకొనే సమయంలోనూ ఎవరూ లవ్ లెటర్స్ వ్రాయలేదని, గ్రీటింగ్స్ కార్డ్ మాత్రం ఇచ్చినట్లు చెప్పింది. ప్రేమ అనేది చాలా బావుంటుందని, అందరూ తప్పకుండా ప్రేమించాలని చెబుతోంది. ఎవరైనా వచ్చి ఐలవ్‌యూ చెప్పినా కోప్పడనంటూంది. ఎవర్నీ ప్రేమించకుండా ఇంత వివరంగా ప్రేమ గూర్చి ఎలా చెబుతుందబ్బా?

# సినిమాపై సుహాసిని పరిశోధన

సినిమా కథల గూర్చి ఆలోచించడం, సినిమాలు చూడడం తర్వాత సినిమా చరిత్ర చదవడం తన నిత్యకృత్యాలని హీరోయిన్ సుహాసిని చెప్పింది. భారతీయ భాషల సినీ చరిత్రలతోపాటు ప్రపంచ భాషల సినీ చరిత్రలను కూడా

## హైదరాబాదు సినిమా వార్తలు

చదివేస్తుంటాను. వాటన్నింటినీ మళ్లీ కంపారిటివ్ స్టడీ చేస్తుంటానంది. ఈ అలవాటు ఇప్పటిది కాదట. మా నాయనమ్మకు సినిమా నాలెడ్జ్ బోలెడు వుంది. మా బాబాయ్ కమల్‌హాసన్‌ను ఈ సినిమా ఎప్పుడు రిలీజైంది, ఫలానా సినిమాల్లో హీరో ఎవరని ఏదో ఒకటి అడిగేది. ఒకవేళ జవాబు చెప్పలేకపోతే సినిమాల్లో నటిస్తూ సినిమాల గూర్చి తెలియదా అని చురక వేసేది. ఎందుకైనా మంచిదని అప్పట్నుంచి సినిమా చరిత్రను తెలుసుకోవడం ప్రారంభించానంది.

### గోరంత సినిమాకు కొండంత పబ్లిసిటీ

తెలుగు సినీ పరిశ్రమలో మీడియాను ఉపయోగించుకొనే నటులలో ఏవిఎస్ ప్రథముడు. దీనికి కారణం పూర్వాశ్రమంలో ఏవిఎస్ పాత్రికేయుడు కావడమే. ఏవిఎస్‌ను దర్శకునిగా చేస్తూ 'సూపర్ హీరోస్' చిత్రం ద్వారా రామానాయుడు తొలిఛాన్స్ ఇచ్చినప్పుడు పత్రికలన్నీ ఏవిఎస్ కబుర్లే వ్రాశాయి.

తరువ 11వ పేజీలో

# మైనంతో శ్రీదేవి, శిల్పా అందాలు

లండన్‌లోని మడామెటు సౌండ్స్ వేక్స్ మ్యూజియంలో అమితాబ్ వేక్స్ విగ్రహాన్ని నిలపడం వార్తా విశేషమయ్యింది. ఇప్పుడు పిపి జ్యూయలర్స్ వారు దేశ రాజధాని ఢిల్లీలోని కరోల్ బాగ్‌లో తమ షోరూమ్‌లో శ్రీదేవి, శిల్పాశెట్టిల వేక్స్ ప్రతిమల్ని ప్రతిష్ఠించ

## నగల దుకాణంలో విగ్రహాలు

రు. మైనంతో తయారు చేసిన ఈ బొమ్మలు ఇక్కడ వేడికి కరిగిపోకుండా ఏసీ రూములో వుంచారు. ఈ బొమ్మల తయారీకి రూప శిల్పులు లండన్ నుంచి వచ్చారు. ఈ విగ్రహాలను రోజుకో వెరైటీ నగలతో అలంకరిస్తున్నారు. వీటిని చూడడానికి జనం ఎగబడుతున్నారు. ఈ ప్రతిమల ప్రతిష్ఠ కార్యక్రమం నవంబర్ 22తేది జరిగింది. ఈ కార్యక్రమానికి విచ్చేసిన శ్రీదేవి, శిల్పాశెట్టిలు తమ ప్రతిమలను చూసుకొని ఆశ్చర్యం వ్యక్తం చేశారట.

### మంచి నటుడ్ని అనిపించుకోవాలి

'నువ్వే కావాలి' చిత్రం ద్వారా హీరోగా పరిచయమైన సాయికిరణ్ గాయకుడు రామకృష్ణ కుమారుడు. తొలిచిత్రం విజయవంతం కావడంతో నాలుగైదు చిత్రాల్లో నటిస్తున్నాడు. చెలియ చిత్రం షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడుతూ నటుడిగా ఎదగడానికి ఎలాంటి పాత్రలు చేయాలో అవన్నీ చేస్తూ తెలుగు చిత్రసీమలో ఒక మంచి నటునిగా నిలచి పోవాలని వుందన్నాడు. యాక్షన్ హీరో అనిపించుకోవాలని మూడు సంవత్సరాలపాటు నానా దెబ్బలు తగిలించుకొని కిక్ బాక్సింగ్ నేర్చుకొన్నట్లు చెప్పాడు. నటుడు కాకరాల వద్ద డైలాగ్ డిక్షన్ నేర్చుకొన్నానని, వెస్టరన్ డాన్స్‌లో కూడా ప్రవేశముందని చెబుతున్న సాయికిరణ్‌కు మంచి రోజులు రావాలని మనసారా కోరుకొందాం.



కామాక్షి ఆర్ట్స్ చిత్రంలో నాగార్జున, సౌందర్య

# అలుపే ఎరుగనిది నా పాట

పాడుకొంటూ పనిచేస్తుంటే అలసటే ఉండదంటుంది గాయని చిత్ర. మా ఇంట్లో ఎవరి పనులు వారు చేసుకోవాలనే కండీషన్‌వుంది. చిన్నప్పుడు నా బట్టలు నేను ఉతుక్కునేదాన్ని. అప్పటికి సంగీత పాఠాలకు వెళ్లడం ప్రారంభించలేదు. అయినా నాకు నచ్చిన లల్లాయి పదాలేవో పాడుకొంటూ బట్టలు ఉతికేదాన్ని. మా ఇంట్లోవాళ్లు కనపడకుండా ఎక్కడో ఒకచోట నక్కి విని ఆనందించే వారట. సంగీతం నేర్చుకోవడం ప్రారంభించాక సంగీత సాధన చేస్తూనే పనిచేసేదాన్ని. ఇప్పటికి అదే అలవాటు కొనసాగుతూంది. వంట చేస్తున్నా, ఇల్లు శుభ్రం చేస్తున్నా, ఇంట్లో ఏ పని చేస్తున్నాసరే గొంతు ఊరుకోదంటుంది. సంగీతం ఇచ్చే ఆహ్లాదం, ఉత్సాహం మాటల్లో చెప్పలేమంటుంది చిత్ర.

## గాయని చిత్ర

### ఆస్కార్‌కు హేరామ్

స్వాతంత్ర్యోద్యమ ఘటనల నేపథ్యంగా కమల్‌హాసన్ స్వీయ దర్శకత్వంలో నిర్మించిన 'హేరామ్' చిత్రం విడుదలకు ముందు, విడుదల తర్వాత వార్తలలోని చిత్రమయ్యింది. ప్రస్తుతం ఈ చిత్రాన్ని ఆస్కార్ అవార్డుకు భారతదేశం నామినీగా ఎంపిక చేయడం కూడా వివాదాస్పదమయ్యింది. కారణం ఈ చిత్రాన్ని ఎంపిక చేసిన తొమ్మిది సభ్యులుగల కమిటీలో ఆరుగురు దక్షిణాదివారు. ముగ్గురు ఉత్తరాదివారు కావడం గమనార్హం. సుష్మాశిరోమణి, అంజనాశర్మ, ప్రభాత్‌పాండే హిందీ సినీ పరిశ్రమకు చెందినవారు కారని, ఫిలిం ప్రొడ్యూసర్స్ గిల్డ్‌కు చెందిన వారని, దక్షిణాది పక్షపాతంతో ఈ ఎంపిక జరిగిందని విమర్శలొచ్చాయి. గతంలో కమల్‌హాసన్‌కు జాతీయ ఉత్తమ నటుడుగా అవార్డు లభించి నప్పుడు కూడా ఆయన సోదరుడు చారుహాసన్ కమిటీలో వున్నాడన్న విమర్శ వినవచ్చింది.

### కుమారుని భవిష్యత్తు కోసం దాసరి పోరాటం

ప్రసిద్ధ దర్శకుడు దాసరి నారాయణరావు తన కుమారుడు అరుణ్ కుమార్ భవిష్యత్తు కోసం అలుపెరుగని పోరాటం ప్రారంభించారు. దాసరితన కుమారుడు అరుణ్‌కుమార్‌ని హీరోగా 'గ్రీకు వీరుడు' చిత్రం చేస్తున్నప్పుడు

తరువ 11వ పేజీలో

# విజయరామరాజులో నవరసాల సారం

దేశభక్తి ప్రధానాంశంగా సి.వి.రెడ్డి "విజయరామరాజు" చిత్రాన్ని నిర్మించాడు. దేశంలో టెర్రరిజం మితిమీరి పోయింది. పాకిస్తాన్ దుండగులు సాగించే దురాగతాలు అధిగమిస్తున్నాయి. కల్లోలాలు, హత్యలు, బాంబు పేలుళ్లు, ఇంకా పలు రకాల విధ్వంస కాండలతో దేశం అల్లకల్లోలమవుతూ వుంది. ఇవిగాక దేశంలో రాజకీయ నాయకుల, అధికారుల దోపిడీ పెరిగిపోతూ వుంది. "అడుగడుగునా గుండె పగిలి అడుగుతున్నది భారత ఖండం భారతీయుల అండదండలను" - అనే పాటతో వర్తమాన భారత పరిస్థితికి హృద్యమైన సంకేతంగా నిలిచి అన్యాయాలను, అక్రమాలను తుదముట్టించే వీరునికోసం భరతమాత పిలువునిస్తుంది. ఆ పిలుపు రేకెత్తించిన చైతన్యంతో విజయరామరాజు (శ్రీహరి) ముందుకు దూకుతాడు. "తలుచుకొంటే ఒక్క రోజులో టెర్రరిస్టులను కాలరాస్తావని" - వినిపించే పాట, అలాగే "పటపటమని పళ్లు కొరుకుతూ పటుతరగతి వేగ టెర్రరిస్టుల పాతమారుస్తాననే" - పాట విజయరామరాజు ధ్యేయాన్ని, దేశభక్తిని, ధైర్యసాహసాలను ప్రతిబింబింపజేస్తాయి. "ఎవరు నువ్వు ఎవరు నువ్వు మారాజా ఏ తల్లికన్నా బిడ్డవో విజయరామరాజు" - అంటూ నేపథ్యగీతంతో భారత ప్రజానీకం విజయరామరాజు దేశభక్తిని హర్షిస్తుంది. అతని త్యాగాన్ని ప్రశంసిస్తుంది.

దేశభక్తితో పాటు టెర్రరిజం, ఏక్షన్, కుటుంబ సెంటిమెంట్లు, కామెడి సమపాళ్లలో చిత్రంతో ముడిపెట్టుకున్నాయి.

కథను గూర్చి పెద్దగా చెప్పుకోతగింది లేదు. హోం మినిస్టర్ (జయప్రకాష్) భద్రతకు ఏర్పరచిన సెక్యూరిటీకి




విజయరామరాజు ఛీఫ్‌గా వుంటాడు. దేశాన్ని ధ్వంసం చేస్తున్న పాకిస్తాన్ ఉగ్రవాదుల తీవ్రతకు, అంతకుమించి దేశంలోని రాజకీయ నాయకులు, అధికారులు సాగిస్తున్న విధ్వంసానికి స్పందించిన విజయరామరాజు దేశరక్షణ కోసం చెయ్యవలసిన సాహసాలు, త్యాగాలు చేసి, తన దేశభక్తిని నిరూపించుకుంటాడు. పాకిస్తాన్ ఉగ్రవాదిగా మనదేశంలో తిష్టవేసి వున్న జబ్బార్‌ఖాన్ (తరుణ్) విజయరామరాజు దేశభక్తిని మెచ్చుకుంటాడు. "భారతదేశంలో ఏం చూశావు అని మా పాకిస్తానీయులు అడిగితే విజయరామరాజు అనే స్వచ్ఛమైన దేశభక్తుణ్ణి నేను చూచాను అని చెప్తాను" అని ఆ ఉగ్రవాది అంటాడు. దీన్ని బట్టి విజయరామరాజు దేశభక్తికి విలువ కట్టవచ్చు. దేశాన్ని ఎంత గాఢంగా ప్రేమిస్తాడో అదే స్థాయిలో తన కుటుంబాన్ని కూడా ప్రేమిస్తాడు. ఆయన భార్య (ఊర్వశి) ఆయన జీవిత ధ్యేయానికి హారతి పట్టి ఆరాధిస్తుంది. తన కుటుంబాన్ని టెర్రరిస్టులు కిడ్నాప్ చేసినప్పుడు వీరోచితంగా వారితో పోరాడి తన కుటుంబాన్ని రక్షించుకుంటాడు విజయరామరాజు. తనపై అధికారి (రంగనాథ్) పాకిస్తాన్‌తో చేతులు కలిపినప్పుడు ఆ దేశద్రోహిని తీవ్రంగా ఎదిరిస్తాడు. ఆ ద్రోహితో విజయరామరాజు జరిపిన వాగ్వివాదం వినతగింది.

రైలు ప్రయాణంలో పెళ్లి బృందంగా వున్న మల్లికార్జునరావు, కళ్ల కృష్ణారావు, నర్రా వగైరాల హాస్యం ఆనందంకలిగిస్తుంది. చిత్రమంతా వివిధ అంశాల్లో శ్రీహరి కనిపిస్తాడు. సన్నివేశాల పరంగా, సాహస కార్యాల తీరులో శ్రీహరి

తరువ 12వ పేజీలో

# వారఫలాలు

9-12-2000తేది నుండి 15-12-2000తేది వరకు వృషభంలో వక్ర గురు, శనులు; మిధునంలో రాహువు; 13తేది వరకు కన్యలో తదుపరి, తులలో కుజుడు; వృశ్చికంలో రవి, బుధులు ; ధనుస్సులో కేతువు; మకరంలో శుక్రుడు; మేష, వృషభ, మిధున, కర్కాటకాలలో చంద్రుడు.



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థిక పరిస్థితి, ఆదాయం అనుకున్నంతగా ఉండదు. కుటుంబంలో సభ్యుల మధ్య కోపతాపాలు; వస్తు నష్టం చేయడం; స్వల్పంగా అప్పు చేయడం జరుగుతుంది. బంధువర్గ సభ్యుల అనారోగ్యవార్తలు వింటారు. విద్యార్థులకు విద్యాప్రగతి బాగుంటుంది. స్థిరాస్తులపై ఆదాయం ఉంటుంది. పెట్టుబడులు, ఇచ్చిన అప్పుల వల్ల సమస్యలుంటాయి. ఉద్యోగులు అధికార వర్గంతో జాగ్రత్తగా మెలగాలి. అనుకున్నంత సులువుగా పనులు కావు. బంధుమిత్రుల కలయిక ఉంటుంది.



## వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

పనులు కొనసాగవు. అందుకు ప్రయత్నాలు కలసిరావు. ఆర్థిక స్థితి బాగుంటుంది. బంధుమిత్రుల రాకపోకలుంటాయి. గౌరవ మర్యాదలు బాగుంటాయి. అవసరాలకు డబ్బు లభించడం, కొత్త పెట్టుబడులపై ప్రయత్నాలు చేయడం, నూతన వస్తు వాహనాలు కొనడం, ఉద్యోగులకు విధి నిర్వహణలో ఆటంకాలు కలగడం జరుగుతుంది. విద్యాప్రగతి బాగుంటుంది.



## మిధునం

(మృగశిర 3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఇబ్బందులే ఎక్కువగా ఉండవచ్చును. ఆర్థికపరంగా కష్టపడతారు. కుటుంబ సభ్యుల మధ్య సహకారం తగ్గి విభేదాలు ఏర్పడవచ్చును. శుభకార్య ప్రయత్నాలు వెనుకకు పోతాయి. శుభకార్యాలలో పాల్గొంటారు.



## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

ఆర్థిక పరిపుష్టి ఉంటుంది. వృత్తి, వ్యాపారాలందు అవకాశాలు బాగుంటాయి. పెట్టుబడులకు ప్రయత్నాలు అనుకూలిస్తాయి. సోదరుల సహకారంతో పనులు సాగుతాయి. బంధువుల రాకపోకలుంటాయి. స్థిరాస్తుల క్రయవిక్రయాలు జరుగగలవు. వారాంతంలో కొద్దిగ ఆరోగ్యలోపం ఉంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది. అధికారులను ఉపయోగించుకొని గుర్తింపు పొందుతారు. దూరప్రయాణాలు పొందుతారు.



## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

ఆదాయం బాగుంటుంది. మొగమాటాలకు ఖర్చుపెడుతుంటారు. కుటుంబ సభ్యుల ఆడంబరాల వ్యయం పెరుగుతుంది. కుటుంబ వ్యక్తులలో ఎడబాటు, దూర ప్రయాణాలుంటాయి. వ్యాపార పనులు పెరుగుతాయి. అధికారుల అనుకూలత బాగుండి పనులు త్వరగా జరుగుతాయి. రావలసిన బాకీలు లభిస్తాయి. వ్యవహారాలు, తగాదాలు పరిష్కారానికి వస్తాయి. ఉద్యోగుల అదనపు బాధ్యతలు పెరుగుతాయి. వ్యవసాయదారులు కొద్దిగా కష్టపడతారు. కుటుంబ సభ్యులకు అనారోగ్యం ఉంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. నూతన పదవి లభించడం, సాంస్కృతిక కళాకారులకు అవకాశాలు రావడం, రాజకీయ పలుకుబడి పెరగడం ఉంటుంది.



## కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం పెరుగుతుంది. పొందవలసిన సహాయం, రావలసిన బాకీలు లభిస్తాయి. ఉద్యోగావకాశాలు వృద్ధి చెందుతాయి. శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చును. అధికారిక ప్రయాణాలు కలుగవచ్చును.

### పంచాంగం

తేది 15 శుక్రవారం ధనుర్మాస ప్రారంభం.

**ముహూర్తాలు**

తేది 11 సోమవారం రాత్రి గంట 9.48లకు కర్కాటక లగ్నాన గృహప్రవేశాలకు. తేది 13 బుధవారం ఉదయం గంట 9.42లకు మకరలగ్నాన గృహారంభ. వివాహ, వ్యాపారాలకు. తేది 14 గురువారం ఉదయం గంట 9.32లకు మకర లగ్నాన గృహారంభ, వ్యాపార, వివాహాలకు సుమూహూర్తాలున్నాయి.

**డిశంబరు తిథులు**

**మార్గశిర శుద్ధ**

తేది 9శని త్రయోదశి సా 6.16గం.వ
తేది 10ఆది చతుర్దశి సా5.00గం.వ
తేది 11సోమ పూర్ణిమ సా3.24గం.వ

**మార్గశిర బహుళ**

తేది12మంగళ పాడ్యమిసా1.27గం.వ
తేది13బుధ విదియ ప11.15 గం.వ
తేది 14బేస్త తదియ ఉ10.00గం.వ
తేది 15శుక్ర చతుర్థి ఉ7.00 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



## తుల

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

కుటుంబ వ్యవహారాలు, మాట పట్టింపులు కలుగవచ్చును. కాని వారాంతంలో మరల సర్దుబాటు కాగలవు. డబ్బు ఎక్కువగా ఖర్చు కాగలదు. ఆదాయం తగ్గుతుంది. ప్రతి పనికి అనేక మార్లు ప్రయత్నించవలసి వుంటుంది. సన్నిహితుల వల్ల సమస్యలేర్పడవచ్చును. అధికారులతో జాగ్రత్తగా ప్రవర్తించాలి. విద్యాప్రగతి సామాన్యం.



## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

అనారోగ్యంపరంగా కాని, ఎదుటి వారిని ఎదుర్కొనే వ్యవహారాల పరంగా గాని ఖర్చులుంటాయి. అప్పు చేసినా ఆశ్చర్యం లేదు. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం సామాన్యం. వైద్య, సాంకేతిక రంగాల వారికి ఉద్యోగ లాభం గాని, ఆదాయం పెరుదలగాని ఉంటుంది. అనుకున్న పనులు కాలయాపన జరుగుతాయి. సాంస్కృతిక, పెట్టుబడి రంగాల వారికి మంచి సమయం, కొత్తవారి పరిచయాలుంటాయి.



## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

డబ్బుకు కష్టపడతారు. రావలసిన బాకీలు గాని, ఎదురుచూసే ఆదాయం గాని వాయిదాలు పడతాయి. పనులు కూడా నెమ్మదిగా జరుగుతాయి. కుటుంబంలో చిన్న విభేదాలు కలుగవచ్చును. స్వయం నిర్ణయశక్తి సరిగా ఉండదు. ఉద్యోగ వ్యవహారాలు జాగ్రత్తగా నిర్వహించాలి. విద్యాప్రగతి బాగుంటుంది. ఖర్చులు పెరగక తప్పవు. ఆస్తిక్రయ విక్రయాలు నిర్ణయం కాగలవు. మనస్థిమితం లేక టెన్షన్ పడతారు. వారాంతంలో అనుకోని ప్రయాణాలు, శుభకార్యాలకు పోవడం. రాజకీయులలో ఉండేవారు జాగ్రత్తపడాలి.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

అనుకున్న పనులన్నీ పూర్తి చేస్తారు. గౌరవ ప్రదంగా గుర్తింపు వుంటుంది. కొద్ది విభేదాలు బంధువులతో, కుటుంబ సభ్యులతో ఏర్పడినా సర్దుకుంటాయి. స్థిరాస్తులుకొనే ఆలోచనలు వస్తాయి. కుటుంబ శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చును. వ్యాపారులకు, వ్యవసాయదారులకు ఆర్థిక పరిస్థితి బాగుంటుంది.



## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఆరోగ్య విషయంలో జాగ్రత్తలు అవసరం. కుటుంబ పనులు జరుపుకొనడం లోగాని, ఉద్యోగపరమైన పనులు జరుపుకోవడంలో గాని పొరపాట్లు, ఆలస్యం జరుగగలదు. జీవితభాగస్వామి ఆరోగ్యం సరిగా ఉండదు. వృత్తి, వ్యాపారపరంగా ఆదాయం బాగుంటుంది. రావలసిన బాకీలకై గట్టి ప్రయత్నం అవసరం.



## మీనం

(పూర్వాభాద్ర4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

అనుకున్న పనులు జరిగిపోతాయి. వారాంతంలో సోదరవర్గంతో విభేదాలు రావచ్చును. ఆరోగ్య విషయం కూడా జాగ్రత్త. కుటుంబసౌఖ్యం బాగుంటుంది. బంధువర్గం వల్ల ఆర్థికంగా వత్తిడి పెరుగవచ్చును. ఉద్యోగులకు అధికారవర్గం వల్ల బాధలుంటాయి. రాజకీయ రంగాల వారికి ప్రోద్బలం బాగుంటుంది.

# జనవాణి

3వ పేజీ కొరవ

ఇప్పుడు అవే విధానాలను అమలు చేస్తోంది. రాజకీయ పార్టీల్లో చిత్త శుద్ధి వుంటే రైతులకు గిట్టుబాటు ధర లభింపజేయడంలో, కల్తీ, నకిలీ పురుగు మందులు మార్కెట్‌లో చలామణిలో లేకుండా ఎప్పుడో చట్టాలు చేసేవి.

కావలి ఎస్వీ సుబ్బరామయ్య

## ఏమిటీ గందరగోళం

విదేశీ బహుళజాతి సంస్థలను భీమా రంగంలోకి అనుమతించడం, ప్రైవేటీకరించడం వల్ల దేశంలోని కోట్లాది మంది పాలసీదారుల డబ్బుకు భద్రత కరువయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. అమెరికాలో ఇప్పటికే నెలకు రెండు ప్రైవేటు భీమా కంపెనీలు బోర్డు తిప్పేస్తున్నాయన్న వార్తలు వినవస్తున్నాయి. అదే ధోరణి మన దేశంలో కూడా కొనసాగితే ఇక్కడి పాలసీదారుల పరిస్థితి ఏం కావాలి. అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థలలోనే పాలసీదారుల డబ్బుకు రక్షణ లేనప్పుడు మన ప్రభుత్వాలు పాలసీదారులకు ఏ మేరకు రక్షణ కల్పించగలవు?

నెల్లూరు ఎస్.సువర్చల

## అవినీతి మంత్రులకు గడువివ్వడమేమిటి?

తెలుగుదేశం ప్రభుత్వంలో ఇప్పటికే అవినీతికి పాల్పడుతున్న మంత్రులు ఆరు నెలల లోపల తమ పద్ధతి మార్చుకోవాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు. పాలనా యంత్రాంగానికి సరైన మార్గ నిర్దేశం చేయవలసిన వ్యక్తులే అవినీతికి పాల్పడుతుండడం వల్ల వ్యవస్థ దారి తప్పుతుంది. అవినీతిని ఏరివేసే విషయంలో గడువివ్వడమేమిటి? వెంటనే అవినీతి మంత్రులను మంత్రి వర్గం నుంచి తొలగించాలి.

నెల్లూరు వి.సుధీర్

## పోలీసుల తెలివి తక్కువ చేష్టలు

ఇటీవల ట్రాఫిక్ క్రమబద్ధీకరణ, ఆక్రమణల తొలగింపు పై పోలీసులు ప్రత్యేక దృష్టి కేంద్రీకరించారు. కానీ ఈ ఆక్రమణల తొలగింపు అన్ని చోట్ల న్యాయబద్ధంగా జరగలేదు. వ్యాపార కూడలి ప్రాంతమైన స్టోన్‌హౌస్‌పేట మెయిన్‌రోడ్డులో అంగళ్ల ముందున్న మెట్లను తొలగించారు. దీనివల్ల ప్రజలకు కలిగే లాభం ఏమిటో అర్థం కావడం లేదు. విజయలక్ష్మి టాకీస్ సందు యివతల మెయిన్‌రోడ్లో పబ్లిక్‌గా తోపుడు బండ్లపైన వ్యాపారం చేసే వారి వద్ద నుంచి మామూళ్లు తీసుకొని వదలి వేయడం వల్ల పోలీసుల చిత్తశుద్ధిని శంకించవలసి వస్తున్నది. పొట్టి శ్రీరాములు విగ్రహం ప్రాంతంలో సర్వేపల్లి కాలువను ఆక్రమించిన టెంకాయలు, నిమ్మకాయలు, పండ్లు, పూల వ్యాపారస్తులు, తోపుడు బండ్లవారు ట్రాఫిక్ పోలీసులకు ఆదాయవనరులు కావడం వల్ల వారిని వదలివేశారు. తొలగించిన మెట్ల స్థానంలో వెంటనే రోడ్డు నిర్మిస్తే ట్రాఫిక్ సమస్య తీరుతుంది. కొత్త ఎస్పీ స్టోన్‌హౌస్‌పేటలో గందరగోళమైన ట్రాఫిక్ వ్యవహారాన్ని మరోసారి పరిశీలించాలి.

నెల్లూరు ఆర్.సత్యనారాయణ

## పురుషోత్తంను ఎవరు హత్యచేశారు?

పౌరహక్కుల సంఘం నాయకుడు పురుషోత్తంను పట్టపగలు నడిబజారులో హత్యచేశారు. హత్యవంటి కేసుల్లో ముఖ్యమైన శవపంచాయతీ జరపకుండానే శవాన్ని పోలీసులు అక్కడ నుంచి తీసివేశారు. పురుషోత్తంను పోలీసులే చంపారని పౌరహక్కుల సంఘం నాయకులు, ఆయన భార్య చెబుతున్నారు. గ్రీన్‌టైగర్స్ ఈ హత్య చేశారని ప్రజా క్రాంతి సేన నాయకుడు హరిభూషన్ చెప్పారు. కాని చివరకు ఈ హత్యను మాజీ నక్సలైటు నయీం నేతృత్వంలో జరిగినట్లు పోలీసులు ప్రకటించారు. ఈ విషయాన్ని నయీం బృందం కూడా ఒప్పుకొంది. కానీ ఈ వ్యవహారంలో ఏదో గందరగోళం దాగుందని బయట నుంచి చూసే వాళ్లకు అనిపిస్తుంది.

నెల్లూరు నెల్లూరుబాబు

## సాయిబాబా దేవాలయం నిర్వహణలో సందేహాలు

నెల్లూరు గాంధీనగర్‌లోని సాయిబాబా దేవాలయం ఏక వ్యక్తిపాలనలో గత పదమూడేళ్లుగా నడుస్తోంది. పాలక వర్గ పెద్దలకు, రాజకీయ నాయకుల అండ వుంది. దీనివల్ల దేవాలయం సర్వసభ్య సమావేశాలు, హుండీ లెక్కలు, భక్తులు ఇచ్చిన విరాళాలు, భూదానాలను ఏ విధంగా వినియోగిస్తున్నారో తెలియడం లేదు. ఈ విషయాలను పాలక వర్గం ఎందుకు బహిరంగ పర్చడం లేదో అర్థం కావడం లేదు.

నెల్లూరు విస్సా రామారావు

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

తీర్మానించారు.

## నెల్లూరులో డాక్టర్ విలియమ్స్

నెల్లూరు జిల్లా రైసు మిల్లు ఓనర్సు అసోసియేషన్ వారు టౌన్‌హాల్‌లో ఏర్పాటు చేసిన సభలో సుప్రసిద్ధ అమెరికా శాస్త్రజ్ఞుడు రాబర్టు విలియమ్స్ గారు బియ్యపు పోషక శక్తిని గూర్చి ప్రసంగించారు. సభకు అధ్యక్షత వహించిన కలెక్టర్ జోగప్పగారు డాక్టర్ విలియమ్స్ గారిని పరిచయం చేశారు.

ఈ శాస్త్రజ్ఞుడు 1886 సంవత్సరంలో నెల్లూరు సమీపంలో వున్న రామాయపట్నంలో అమెరికన్ తల్లిదండ్రులకు జన్మించారు. అమెరికా దేశంలోనే విద్యాభ్యాసం చేసి 1908 సంవత్సరం చికాగో విశ్వవిద్యాలయం వారి ఎం.ఎస్.సి. డిగ్రీ పొందారు. శాస్త్ర సంబంధమైన విషయాలపై అద్భుతమైన పరిశోధన చేసి పేరు పొందాడు. ఫిలిప్పయిన్స్ దేశంలో ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించి, 1945 నుండి న్యూయార్కు నగరంలో రీసర్చి కార్పొరేషన్‌లో ప్రముఖ స్థానం వహించి వున్నారు.

విలియమ్సు గారు ప్రసంగిస్తూ 1910లో తాము బియ్యంలో నుంచి బి.విటమిను వేరుచేయడం కోసం ప్రయోగం ప్రారంభించారని 1923లో ఆ కృషి నెరవేరి, 1926లో ఆ విటమిన్ను సంయోగ క్రియతో సాధించగలిగారని తెలిపారు. బటాను ద్వీప కల్పంలో జరుపబడిన ప్రయోగాన్ని వివరిస్తూ అక్కడ బెరిబెరి వ్యాధితో మరణించే వారి సంఖ్య విపరీతంగా వుండినదని, తాము సృష్టించిన విటమినుతో కూడిన బియ్యం వండి ఆ సంఖ్యను అత్యద్భుతంగా తగ్గించ గలిగామని తెలిపారు. తెల్లబియ్యం మంచిదికాదని తెలుపుతూ, ఉప్పుడు బియ్యం, దంపుడు బియ్యం పాలిష్ చేయకుండా మిషనుకు వేయబడిన బియ్యం మాత్రమే తినడం ఆరోగ్యదాయకమని ఉద్ఘాటించారు. గంజి వార్చడం వల్ల బియ్యంలోని పోషణశక్తి పోతుందని గంజి వార్చకుండా తక్కిన నీళ్లు పోసి ఇగరబెట్టడం మంచిదని తెలిపారు.

* * *

# నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

తీన్నారై పోయిన ఈ రోడ్డులో ఏదోఒక బస్సు తూలిపడిపోయే వరకు అధికారులు స్పందించేలట్లు లేరు.

## గ్రీన్‌గ్లోరి వ్యవహారంలో సి.సి. బాబుపై తొలివేటు

పదిహేనేళ్లుగా ఎస్పీ క్యాంప్ క్లర్క్ గా కొనసాగిన మహేంద్రబాబురెడ్డి (బాబు) ను జిల్లా ఎస్పీ కె.శ్రీనివాసరెడ్డి సస్పెండ్ చేశారు. గ్రీన్‌గ్లోరి చైన్ లింక్ స్కీమ్‌లో పలువురు పోలీసులను బలవం తంగా బాబు చేర్పించారన్నది ఆయన ఎదు ర్కొన్న ప్రధాన ఆరోపణ. ఇది దర్యా ప్తులో రుజువవ్వడంతో ఆయనపై సస్పెన్షన్ వేటుపడింది. ఏడెనిమిది మంది ఎస్పీల దగ్గర సిసిగా పనిచేసిన బాబు గతంలో తన విధుల వరకే పరిమితమ య్యేవారు. సి.వి.నరసయ్య బాధ్యతలు తీసుకున్నాక ఆయన తీసుకోవాలనుకొన్న ప్రతి మొత్తాన్ని బాబు చేతుల మీదుగా పుచ్చుకొనేవారు. ఈ మధ్య జరిగిన పోలీసు బదిలీల్లో `డబ్బు' చేయిమారింది బాబు చేతుల్లోనే. గ్రీన్‌గ్లోరి వ్యవహారంలో నరసయ్య ఉత్సాహాన్ని చూసి బాబు రెట్టింపు ఉత్సాహాన్ని చూపి `దొరగారి పేరు చెప్పి ఎక్కువ మొత్తం దండు కొన్నారు. తాను ఏళ్ల తరబడి ఎస్పీ బంగళాలో పాతుకపోయి వున్నానని తనను ఎవరూ ఏమీ చేయలేరన్నది ఆయన ధీమా. కాని వెయి గొడ్లను తిన్న రాబందు ఒక గాలి వానకు చచ్చి ఊరు కొన్నట్లయ్యింది ఆయన పరిస్థితి. గ్రీన్‌గ్లోరి వ్యవహారంలో పెద్ద చేపలపై ఎస్పీ శ్రీని వాసరెడ్డి ఎప్పుడు వల విసురుతారో వేచి చూడాల్సిందే!

## ముస్లింలకు రిజర్వేషన్ కల్పించాలి

బాబ్రీ మసీదు అమరత్వ దినాన్ని ముస్లిం హక్కుల పరిరక్షణ దినంగా పాటిస్తూ ముస్లిం హక్కుల పరిరక్షణ సమితి నేతృత్వంలో కోటమిట్టలోని పాదిమంజిల్‌లో 6తేది బహిరంగ సభ జరిగింది. సభాధ్యక్షులు కె.ఎం.సుభాన్ మాట్లాడుతూ దేశవ్యాప్తంగా ముస్లింలు అభద్రతా భావానికి గురైవున్నారని. స్వాతంత్ర్య పోరాటంలో బలిదానాలు చేసిన ముస్లిం అమరవీరుల నుండి స్ఫూర్తిని పొందాలని చెప్పారు. అంతేకాక భారత ముస్లింలలో రాముడి, కృష్ణుడి రక్తం ఉందని ఆర్.ఎస్.ఎస్. నేత సుదర్శన్ దేశం మొత్తం తిరిగి ప్రచారం చేస్తున్నారని, ముస్లింల విశ్వాసం ప్రకారం ప్రపంచ మానవాళి మొత్తం `ఆదం - హవ్వ'ల సంతానమని, ఆ పరంగా రాముడు, కృష్ణుడిలో కూడా `ఆదం - హవ్వ'ల రక్తమే వుందని చెప్పారు. చంద్రబాబు మసీదులకు, దర్గాలకు, శ్మశానాలకు చేస్తున్న ఆర్థిక సహాయానికి బదులుగా ముస్లిం విద్యార్థులకు 15శాతం రిజర్వేషన్ కల్పించడానికి కేటాయిం చాలని కోరారు. మునిసిపల్ వైస్‌ఛైర్మన్ సందానిబాషా మాట్లాడుతూ మతోన్మా దులను ప్రత్యేకంగా గుర్తించాలని. ముస్లిమేతర సమాజంలోని ఇతర లౌకిక శక్తులతో ఐక్యత సాధించాలన్నారు. సభలో ఎం.ఎ.ఖాదర్, అబూబకర్, ఇలియాస్ బేగ్ తదితరులు మాట్లాడారు.

## జైలర్ వివరణ

గతవారం జమీన్‌రైతులో జిల్లా జైలుపై వచ్చిన వార్తకు జైలు పర్యవేక్షణా ధికారి టి. అనంతరావు వివరణ పంపారు. జైలు మాన్యువల్ ప్రకారం ప్రతి ఖైదీకి భోజనం అందిస్తున్నాం. బియ్యాన్ని సివిల్ సప్లయిస్ వారి నుంచి సూపర్‌ఫైన్ రకం కొంటున్నాం. ప్రభుత్వ నిబంధనల ప్రకారం ఒక ఆదివారం వేటమాంసం, ఒక ఆదివారం కోడి మాంసం ఖైదీలకు 175 గ్రాముల వంతున సరఫరా చేస్తున్నట్లు చెప్పారు. జైలుకు వేట, కోడి మాంసం దట్టాలు కాంట్రాక్టర్ సరఫరా చేస్తారని. దాన్ని తాను స్వయంగా పరీక్షించి తర్వాత చిన్న ముక్కలుగా కొట్టించి శుభ్రంగా వండించి, వడ్డించడం జరుగుతుందన్నారు. ఖైదీలను జైలులో కొట్టడం లేదన్నారు. నెల్లూరు టౌన్‌లో భాగమైన జైలులో దోమలు సహజమేనని ఒప్పుకొన్నారు. జైలులో ఇద్దరు మంగలివాళ్లు వున్నట్లు, ఖైదీలం దరికి హెల్త్ కార్డులిచ్చినట్లు పర్యవేక్షణా ధికారి వివరించారు.

## ఆంధ్ర మహాభారతోపన్యాసాలు

వర్తమాన సమాజం ఆధ్వర్యంలో ఆంధ్ర మహాభారతం 18 పర్వాలపై 18రోజులపాటు జరగనున్న ఉపన్యాస పరంపరలో భాగంగా 6తేది సమాజం పూర్వాధ్యక్షులు పి.వి.రమణారెడ్డి జ్యోతి ప్రజ్వలనం కావించి సభలను ప్రారంభిం చారు. మొదటి రోజు సభలో ఆదిపర్వం పై సాహిత్య విమర్శకులు పాకాల వెంకటకృష్ణయ్య మాట్లాడారు. నన్నయ్య రచించిన `శ్రీవాణీ గిరిజాశ్చిరామ' అన్న ప్రథమ శ్లోకంలోనే వస్తు నిర్దేశం కావిం చారని, శ్రేయస్సే కాకుండా ప్రేయస్సు కూడా ధ్వనింపజేసినట్లు చెప్పారు. అవ్య స్థితమైన తెలుగు భాషకు వ్యవస్థారూ పాన్ని కల్గించారని వివరిస్తూ ఆదిపర్వం లోని కొన్ని ముఖ్యమైన ఆఖ్యాన, ఉపాఖ్యానాలైన యయాతి చరిత్ర, కద్రు వినతల కథ, శకుంతలో పాఖ్యానం, ప్రమద్వర కథ, పంచేంద్రో పాఖ్యానం, ద్రౌపది జన్మవృత్తాంతం, పాండవుల జన్మవృత్తాంతం, కుమారాస్త్ర విద్యా ప్రదర్శనం ఘట్టాలను వివరించారు. సభాపోషకులు ఎం.ధర్మారెడ్డి నగదు, దుశ్శాలువ, జ్ఞాపికతో వక్తను ఘనంగా సన్మానించారు. సమాజం అధ్యక్షులు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి సభను స్వాగతించి, సభల విశేషాలను గూర్చి విపులంగా వివరించారు. కార్యదర్శి పొన్నాల రామ సుబ్బారెడ్డి చివరన కృతజ్ఞతలు తెలియ జేశారు.

## కౌన్సిలర్ అభినందనసభ

నెల్లూరు మునిసిపల్ కౌన్సిలర్ శ్రీమతి సల్మాబషీర్‌ను కాంగ్రెస్ మైనార్టీ సెల్ ఇందిరాభవన్‌లో సన్మానించింది. సల్మాబషీర్‌కు నేషనల్ సాలిడారిటీ అవార్డు వచ్చిన సందర్భాన్ని పురస్కరిం చుకొని ఈ కార్యక్రమం ఏర్పాటయ్యింది. జిల్లా మైనార్టీ సెల్ ఛైర్మన్ ఎస్.ఎ.ఎం. హుస్సేని, మహిళా కాంగ్రెస్ జిల్లా అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రవీణ్ కుమార్‌రెడ్డి, కౌన్సిలర్లు టి. బాలసుధాకర్, టి.ఆరోగ్యస్వామి, వి.నాగేశ్వరరావు, మైనార్టీ నాయకులు బైరవరపు భాస్కర్, వింజమూరు కాలేషా, ఖాజాబీ, షకీలా, షమీమ్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## క్యాన్సర్ వైద్యశాలకు విరాళం

నెల్లూరులో ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటి ఆధ్వర్యంలో పూర్తి కావస్తున్న క్యాన్సర్ వైద్యశాలకు ఫర్నీచర్ కొనుగోలు చేసేందుకు ఇందుకూరుపేట మండలం నిడిముసలి గ్రామస్తురాలు గణేశం కౌసల్యమ్మ 40వేల రూపాయలు విరాళం అందించారు. తన జీవిత భాగస్వామి కీర్తిశేషులు వెంకటనారాయణరెడ్డి జ్ఞాప కార్థం ఈ విరాళాన్ని కౌసల్యమ్మ 2తేది జిల్లా కలెక్టర్ కె.ప్రవీణ్‌కుమార్‌కు అందజేశారు.

## అంబేద్కర్ వర్ధంతి సభ

రాజ్యాంగ నిర్మాత డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ 44వ వర్ధంతి సభను దర్గామిట్టలోని అంబేద్కర్ భవన్‌లో అంబేద్కర్ మిషన్ 6తేది నిర్వహించింది. ఈ సందర్భంగా జరిగిన సభలో అంబేద్కర్ మిషన్ ఛైర్మన్, రిటైర్డ్ పిఎఫ్ కమీషనర్ వి. అరుణాచలం మాట్లాడారు. అంబేద్కర్ దయవల్ల నిమ్నజాతులకు నేటి సమాజంలో గౌరవ స్థానం లభించింది. నిమ్నజాతుల వారికి ఆయనే నిజమైన దేవుడన్నారు. మిషన్ సభ్యులు డాక్టర్ శ్రీనివాసులు, టి.రమ ణయ్య, నరసారావు, వెంకయ్య, ఎస్.రాజా రావు, రమాబాయి మహిళా మండలి అధ్యక్షురాలు రాధమ్మ తదితరులు సభలో మాట్లాడారు.



అంబేద్కర్ వర్ధంతిని పురస్కరించుకొని ఆయన విగ్రహానికి పూలమాల వేస్తున్న అంబేద్కర్ మిషన్ ఛైర్మన్ అరుణాచలం, ప్రక్కన రాధమ్మ, డాక్టర్ శ్రీనివాసులు, తదితరులున్నారు.

## సినిమా

9వ పేజీ కొరవ

గోరంత సినిమాకు కొండంత పబ్లిసిటీ వచ్చిందేకాని, పబ్లిసిటీ ఇచ్చినన్ని రోజులు ఆ సినిమా ఆడలేదు. పై పెచ్చు రామానాయుడు, ఏవిఎస్, బ్రహ్మానందం ఆ చిత్ర విజయంపై ఇచ్చిన ప్రకటనలు వివాదాస్పదంగా మారాయి. తదుపరి దాసరి, శ్రీనివాస ఆర్ట్స్, రామానాయుడు తమ చిత్రాలకు దర్శకత్వం చేపట్టమని అవకాశమిచ్చినా ఏవిఎస్ తొందర పడలేదు. రోజా రమణి కుమారుడు తరుణ్ హీరోగా, రాజశేఖర్ దర్శకునిగా అంకుల్ పేరుతో స్వంత సినిమాను ఇటీవల పూర్తి చేశారు. ఈ ఆడియో క్యాసెట్ ఆవిష్కరణోత్సవాన్ని ఏవిఎస్ తనదైన శైలిలో నిర్వహించారు. ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం ముఖ్యఅతిథిగా విచ్చేసిన నాటి కార్యక్రమానికి ఏడుగురు సంగీత దర్శకులు రాజ్, మణిశర్మ, శ్రీప్రితమ్, ఆర్.పి.పట్నాయక్, వీణాపాణి, చక్రి, వందేమాతరం శ్రీనివాస్ హాజరయ్యారు.

తరుణ్ నటించిన తొలి చిత్రం `నువ్వేకావాలి' సూపర్‌హిట్ అయినందు వల్ల, ఆయన నటిస్తున్న రెండవ చిత్రం `అంకుల్'కు కమర్షియల్ అడ్వంటేజ్ వున్నా ఏవిఎస్ ప్రొఫైల్ మెయిన్‌టెయిన్ చేస్తున్నారు. ఓవర్ ఎక్స్‌పెక్టేషన్ తన చిత్రాన్ని దెబ్బ తీస్తుందేమోనని భయ పడుతున్నారు. జాగ్రత్తగా విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు.

## హోంగార్డు

4వ పేజీ కొరవ

ఫకీరయ్య, ఎ.ఆర్.డిఎస్పీ లక్ష్మీనారాయణ, పట్టణ డిఎస్పీ రాజగోపాల్, హోంగార్డ్స్ ఇన్స్‌పెక్టర్ ఎ.సి.నాగేశ్వరరావు ఈ కార్య క్రమంలో పాల్గొన్నారు.

## రాముడు

4వ పేజీ కొరవ

అభినయించిన తీరు అత్యుత్తమ నృత్య కౌశలాన్ని చాటాయి. ఆ ప్రదర్శన ఎంత ముచ్చటగా, లాలిత్యంగా నడిచిందో... ఆ తర్వాత ప్రదర్శించిన మహిషాసుర మర్దనంలో శక్తి స్వరూపిణిగా ఆమె సాక్షాత్కరించిన తీరు ప్రేక్షకుల్ని మంత్ర ముగ్ధుల్ని చేసింది. నర్తకి అచ్యుత మానసను సింహపురి సంగీత సభ వ్యవస్థాపక అధ్యక్షుడు ఆర్వీ నాగరాజు, నెల్లూరు ఆదాయపు పన్ను శాఖాధికారి సుదర్శన్ ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమాన్ని సంస్థ కార్యదర్శి బి.వి.నర సింహం నిర్వహించగా, కార్యనిర్వహణలో ఆహ్వాన సంఘ సభ్యులు వాకాటి విజయకుమార్‌రెడ్డి, బెజవాడ నరేష్ చంద్రారెడ్డి సహకరించారు.

## విరజిమ్మాలి

4వ పేజీ కొరవ

స్థానిక కౌన్సిలర్ వున్నం బసవయ్య నిలచివున్న నీటిని కాలువలు తీయించి తూర్పు శివారు ప్రాంతాల కాలువల్లోకి మళ్లించడం పట్ల ఎమ్మెల్యే, కౌన్సిలర్‌ను అభినందించారు. ఇటువంటి శివారు ప్రాంతాల్లో సెంట్రల్ మెయిన్ డ్రైన్ ఖచ్చితంగా అవసరమవు తుందని ఎమ్మెల్యే అభిప్రాయపడి ఈ దిశగా ప్రయత్నాలు మొదలు పెడతామన్నారు. ఎమ్మెల్యే వెంట మునిసిపల్ వైస్ ఛైర్మన్ సందానిబాషా, ఇన్‌ఛార్జ్ కమీషనర్, డివిజనల్ ఇంజనీరు సమి తదితరులు పాల్గొన్నారు.

## ఖైదీలవార్డు

4వ పేజీ కొరవ

ఆదేశించిన ఏ పెద్ద మనిషి కూడా రెండు గంటలకు మించి జైలులో ఉండలేదంటే కోర్టు రిమాండ్‌కు డబ్బు ముందు విలువ లేదనే చెప్పాలి. వాస్తవంగా బాగోలేక అమ్యామ్యాలు చెల్లించలేని ఖైదీల పట్ల పోలీసులు పశుత్వంతో వ్యవహరిస్తారు. ఈ ధోరణి పోలీసులు మార్చుకోవాలి. ఈ వ్యవహారంపై ఎస్పీ దృష్టి కేంద్రీకరిం చాల్సి వుంది.

## నా పాట

9వ పేజీ కొరవ

అరుణ్‌కి ఎన్నో ఆఫర్స్ వచ్చాయి. కాని దాసరి అరుణ్ ఒక సినిమా తర్వాత మరో చిత్రంలో నటించాలన్న ఫార్ములా రూపొందించుకొని ఒప్పుకోలేదు. గ్రీకు వీరుడు అనుకొన్నంతగా హిట్ కాకపోవ డంతో తారాపథంలో అరుణ్ వెనుక బడ్డారు. తన కుమారుని హీరోగా నిల బెట్టాలన్న కసితో `చిన్నా' చిత్రాన్ని దాసరి ఇటీవల పూర్తి చేశారు. ఈ చిత్రం ఆడియో క్యాసెట్ విడుదల సందర్భంలో దాసరి మాట్లాడుతూ గ్రీకువీరుడు విజయ వంతం కాకపోవడానికి రచయితగా తాను విఫలం చెందడమే కారణమని ఒప్పు కొన్నారు. చిన్నా చిత్రంలో నటిస్తూనే మోహన్‌బాబుతో దాసరి తీస్తున్న `కొండవీటి సింహాసనం'లో అరుణ్ చేత ప్రత్యేక పాత్ర పోషింపజేస్తున్నారు. శ్రీహరి హీరోగా నటించే మరో చిత్రం ఒరేయ్... తమ్ముడులో కూడా అరుణ్ ముఖ్య పాత్రలో కనిపిస్తాడు. ఫెయిల్యూర్ కాలంలో అగ్రనటులు ఎన్టీరామారావుకు మనుషులంతా ఒక్కటే. అక్కినేని నాగేశ్వరరావుకు ఏడంతస్తుల మేడ, నాగార్జునకు మజ్నూ చిత్రాలను ఇచ్చిన దాసరి తన కుమారుని సెకండ్ ఇన్నింగ్స్ కోసం చమటోడుస్తున్నారు.

## తెలుగువారి హిందీ చిత్రాలు

తెలుగు, తమిళంలో అఖండ విజయం సాధించిన ఒకే ఒక్కడు చిత్రాన్ని హిందీలో నాయక్ - ది రియల్ హీరో పేరుతో పునర్నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి ఎ.ఎం.రత్నంనే నిర్మాత. అనిల్‌కపూర్, రాణిముఖర్జీ, అమ్రిష్‌పూరి, పూజాబాత్రా నటిస్తున్న ఈ చిత్రంలో సుస్మితాసేన్ ఓ ప్రత్యేక పాత్రలో నటిస్తోంది. ఈ చిత్రానికి సంగీతం ఎ.ఆర్.రెహ్మాన్.

పద్మాలయా స్టూడియోస్ హేమ మాలిని కుమార్తె ఈషా డియోల్ నాయికగా తీస్తున్న చిత్రంలో తుషార్ హీరో. సంజయ్‌చెల్ దర్శకుడు. హిమేష్ రేషామ్మియా సంగీతదర్శకుడు.


**జమీన్‌రైతు చందా**

సంవత్సరానికి రూ.100లు

విదేశాలకు రూ.650లు

Registered : RN 1156 / 57

No. A.P. / VJA / 52 / 8 / 2000



## జిల్లావార్తలు

ఇతనిపై జాయింట్ కలెక్టర్ చేత విచారణ చేయించాలని గ్రామస్తులు కోరుతున్నారు.

### అవినీతిమయమైన రెవిన్యూ కార్యాలయం

తోటపల్లిగూడూరు మండల కార్యాలయం అవినీతిమయమయ్యింది. ఎవరైనా పని మీద కార్యాలయానికి వచ్చే ప్రజలను, సిబ్బంది లంచాల కోసం పీక్కుతింటున్నారు. ప్రతి పనికి ఒక రేటు విధించి, దాన్ని చెల్లిస్తే గాని ఏ పని చేయడం లేదు. ఆదాయ, కుల ధృవీకరణ పత్రాలివ్వను సైతం డబ్బులు వసూలు చేస్తున్నారు. వి.ఏ.ఓ.లు సిబ్బందికి బ్రోకర్లుగా మారి ప్రతి పనిలో తాము వాటా పొందుతున్నారు. ఈ ఆఫీసులో ఏళ్ళతరబడి పాతుకు పోయిన గుమస్తా అవినీతిపరుల గ్యాంగ్‌కు నాయకుడు. సిబ్బందిని చక్కదిద్దే ధైర్యం ఎమ్మార్వోకు లేదు. ఉన్నతాధికారులు కల్పించుకొని తోటపల్లిగూడూరు మండల కార్యాలయాన్ని సరైనదారిలో పెట్టాల్సి వుంది.

### అధికారుల నిర్లక్ష్యం - పేదల ఇళ్లు జలమయం

కనిగిరి రిజర్వాయరు నుంచి వివిధ కాల్వలకు నీటిని విడుదల చేయడంలో ఇరిగేషన్ అధికారులు ప్రవర్తించిన నిర్లక్ష్యం కారణంగా మండలంలో పేదలకు చెందిన పంట పొలాలు, ఇళ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. గతవారం తుఫాన్ హెచ్చరికలకు ముందు కనిగిరి రిజర్వాయరులో 18.2 అడుగుల నీటిమట్టం ఉంచేందుకు ప్రధాన కాలువలన్నింటికీ నీటి విడుదల ఆపుచేయించారు. వెంటనే వచ్చిన భారీ వర్షాలకు వరద వచ్చి కనిగిరి రిజర్వాయరు చేరింది - దీంతో భంగు తిన్న ఇరిగేషన్ అధికారులు హడావుడిగా ఎలాంటి ముందు జాగ్రత్త చర్యలు చేపట్టకుండా మలిదేవికి నీటిని విడుదల చేసేశారు. దీంతో మలిదేవి పరీవాహక ప్రాంతాలలో దాదాపు 200 ఇళ్లు, 500 ఎకరాలలోని వరి పంట మునిగిపోయింది. ఇరిగేషన్ అధికారులు ముందు జాగ్రత్తగా నీటిని నిలుపుదల చేయించి ఉండక పోయినట్లయితే వరద నీటికి తమ పొలాలు మునిగేవి కావని రైతులంటున్నారు. తొలుత నీటిని నిలిపిన సమయంలో పవ్వేరు బిట్-II నీటి వినియోగదారుల సంఘం డైరక్టరు పింజమూరు వెంకటేశ్వర్లు డి.ఇ.ఇ.వి అడగ్గా తాము టర్నర్ సిస్టమ్ పెట్టామని, రిజర్వాయరు నుంచి నీటి నిలుపుదల, విడుదలకువివరికీ ఎలాంటి సంజాయిషీ చెప్పనవసరం లేదని అన్నట్లు తెలిసింది. ఇరిగేషన్ అధికారుల అనాలోచిత చర్య వల్ల జనజీవనం స్తంభించి, గుడిసెలు, చిన్నపాటి ఇళ్లు నీళ్లలో మునిగి వేలాది రూపాయల నష్టం జరిగింది. జరిగిన సంఘటనకు బాధ్యులైన ఇరిగేషన్ అధికారుల మీద కలెక్టర్ స్పందించి చర్యలు తీసుకోవాలని బాధిత రైతులు కోరుతున్నారు.

### ఛలో హైదరాబాద్ విజయవంతం చేయండి

మాదిగ, మాలలు మరియు ఇతర

5వ పేజీ కొరవ

అణగారిన వర్గాల మీద జరుగుతున్న దాడులకు నిరసనగా ఈ నెల 16న జరిగే ఛలో హైదరాబాద్ కార్యక్రమానికి వేలాదిగా ప్రజలు తరలి రావాలని ఎం.ఆర్.పి.ఎస్. జిల్లా అధ్యక్షులు జి. రమణయ్య మాదిగ్ పిలుపు నిచ్చారు. ఈ కార్యక్రమానికి జనసమీకరణ చేసే కార్యక్రమానికి మంగళవారం బుచ్చిలో లాంఛనంగా ప్రారంభించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ ఎస్‌సిల వర్గీకరణ వల్ల మాల, మాదిగల ఐక్యత దెబ్బతింటుందని అనుకొంటే అది పొరపాటేనని, 1975 నుంచి హర్యానా, పంజాబ్ రాష్ట్రాలలో ఎస్‌సిల వర్గీకరణ అమలవుతూందని చెప్పారు. రాష్ట్రంలో ఎస్సీ, ఎస్‌టి, మైనార్టీలకు చంద్రబాబు పాలనలో అభివృద్ధి కుంటుపడిందని, సిఎం విధానాలు అణగారిన వర్గాలకు గొడ్డలి పెట్టులా తయారైందని చెప్పారు. చంద్రబాబు పాలనలో పేదలకు జరిగిన అభివృద్ధి విషయంలో శ్వేతపత్రం విడుదల చేయాలని డిమాండ్ చేశారు. కార్యక్రమంలో ఎం.ఆర్.పి.ఎస్. నాయకులు దర్శిగుంట శీనయ్య, ప్రసాద్, రాధాకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

### కబోదిలా ఎక్సైజ్ - సిండికేట్ ఇష్టారాజ్యం!

బుచ్చిరెడ్డిపాళెం ఎక్సైజ్ అధికారులు కళ్లున్న గుడ్డివారుగా ప్రవర్తిస్తుండడంతో స్థానిక మద్యం సిండికేట్ తమ ఇష్టానుసారంగా వేళాపాళా లేని సమయాల్లో, లూజ్ విక్రయాల జోరు శృతిమించి పోతున్నాయి. ప్రభుత్వ నిబంధనల ప్రకారం మద్యం షాపులు ఉదయం పదకొండున్నర నుంచి రాత్రి పదిన్నర వరకు తెరవాలి. బుచ్చిలో మాత్రం అందుకు విరుద్ధంగా ఉదయం ఎనిమిది నుంచి రాత్రి 12 వరకు మద్యం అమ్మకాలు సాగిస్తున్నారు. బుచ్చిలో ప్రతి రోజు ఉదయం ఎనిమిది గంటలకు టిఫిన్ దొరుకుతుందో లేదోకాని మద్యం మాత్రం సిద్ధంగా ఉంటుంది. బుచ్చి మండలంలో అధికారికంగా 8 మద్యం షాపులుండగా వాటికి అనుబంధంగా దాదాపు 90 బెల్ట్ షాపులు నడుస్తున్నాయి. బుచ్చి, రేబాల గ్రామాలలో ప్రతి మద్యం షాపుకు అనుబంధంగా "ప్రత్యేక గది" ఏర్పాటు చేసి వున్నారు. అందులో బార్ అండ్ రెస్టారెంట్ తరహాలో మందుబాబులకు ఏర్పాట్లు ఉండటం విశేషం. ఈ ప్రాంతాలలో రాత్రి పదిగంటలకు మహిళలు వెళ్లాలంటే మందుబాబుల ఆగడాలు భరించాల్సి వుంది. రిజిష్టార్ ఆఫీసు ప్రాంతంలో ఇటీవల మందుబాబుల ఆగడాలు శృతిమించడంతో కొందరు మహిళలు త్రాగుబోతులను గదిలో వేసి బంధించారు. అయినప్పటికి అధికారులు ఈ ప్రాంతంలో లూజ్ విక్రయాలపై చర్యలు మాత్రం నిల్. రెండవ ఆట సినిమా వదలిన తర్వాత ఈ ప్రాంతాల వైపుగా మహిళలు వెళ్లాలంటే భయం ఎక్సైజ్ అధికారులు మాత్రం ప్రతినెలా సిండికేట్ విదిలించే లక్షా 15వేల ఎంగిలి మెతుకులు తింటూ కాలక్షేపం చేస్తున్నారు. ఇక తనిఖీలు ఒక ప్రహసనంలా జరుగుతున్నాయి. సిండికేట్ వారు ఎక్సైజ్ వారిని ఎప్పుడు రమ్మంటే అప్పుడు వచ్చి "అంతా బాగుంది" అని వెళ్లిపోయే పరిస్థితి. కంచే చేను మేసినట్లు కొందరు సిబ్బంది సైతం వేళకాని వేళల్లో దుకాణాలలో తిష్టవేసి తాగుతున్నారు. బుచ్చిమండలంలో మంచినీరు దొరకని గ్రామాలైతే చాలా ఉన్నాయి కాని బెల్ట్ షాపులు లేని పల్లెలు బహు అరుదు. ఇటీవల దామరమడుగులో బెల్ట్ షాపుల జోరు ఎక్కువ కావడంతో కొందరు మహిళలు నడుంబిగించి ఆ షాపులను మూయించివేశారు. నెల్లూరులో అనధికార బార్లను దడదడలాడించిన జిల్లా ఎస్‌పి ఒక పూట తీరిక చేసుకొని బుచ్చికి వచ్చి రెచ్చిపోయివున్న అనధికార బార్లపని పట్టాలని ప్రజలు కోరుతున్నారు.



ప్రజాపథం కార్యక్రమంలో భాగంగా మునిసిపల్ అధికారులను మందలిస్తున్న ఎమ్మెల్యే వివేకానందరెడ్డి

### ఎమ్మెల్యే చెప్పినట్లు ఆడుతున్న అధికారులు

కోవూరు ఎమ్మార్వో, ఎస్‌ఐలు - ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి చెప్పినట్లు ఆడుతున్నారు. ఆయన ఎవరి మీద కేసు పెట్టమంటే వారి మీద అకారణంగా కేసులు పెట్టి ఇబ్బంది పెడుతున్నారు. పాటూరుకు చెందిన రైతు విజయసేనారెడ్డి తన భూమి వున్న ఇమ్మారెడ్డిగుంట ప్రాంతంలో ప్రభుత్వ భూమి సెంటు ఆక్రమించుకోకపోయినా అనవసరంగా అతడ్ని ఎమ్మార్వో, ఎస్‌ఐలు తప్పుడు కేసులో ఇరికించి ఇబ్బందుల పాలు చేశారట. వాస్తవంగా గ్రామ స్మశాన స్థలం, ఊరి మధ్యలో పంచాయతీ బావి పూడ్చి కొట్లు కట్టిన వారు, హరిజన వాడకు పోయే దారిలో దరువు ఆక్రమించిన పెద్దల జోలికి మాత్రం వీరు వెళ్లలేదు. అధికారులు మరీ వెన్నెముక లేనివాళ్ల మాదిరి తయారైతే ఎలా?

### చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

మీద చిత్రీకరించిన ఫైట్సు సన్నివేశాలు ఆకర్షణీయంగా కుదిరాయి. వీటికి ఎ. విజయకుమార్ కెమెరా మంచి పట్టును కూర్చింది. ఫైట్సులోనేగాక, దేశభక్తితో చేసిన త్యాగాల్లోను, తన కుటుంబాన్ని రక్షించుకొనే సన్నివేశాల్లోనూ, మిగతా అన్నిటా శ్రీహరి ఆకట్టుకునే నటన ప్రదర్శించాడు. మిగతా వారంతా పాత్రోచితంగా నరితూగారు.

కథ, మాటలు, స్క్రీన్‌ప్లే పోసాని కృష్ణమురళి వ్రాశాడు. స్క్రీన్‌ప్లే, కథను ఉన్నతంగా నడిపించింది. మాటల్లో ఊపు ఎక్కువగా ఉంది. అన్యాయాన్ని, ఉగ్రవాదాన్ని తుదముట్టించాలన్న ఉద్రేకం, తపన మాటల్లో ధ్వనిస్తాయి. దేశభక్తి సన్నివేశాల్లోని ఆర్ద్రతని అక్షరాల్లో పొదిగాడు రచయిత, దర్శకుడు వీరశంకర్ తన ప్రభావాన్ని చిత్రమంతా కనుపరిచాడు. ఇది అందరినీ ఆకట్టుకునే చిత్రం, దేశభక్తిని పెంచే చిత్రం.

### మాబాబు

మొదటి పేజీ కొరవ

బలపడి పోతున్నాయి. ఏదో ఒకటి చేసి దీన్ని నిలువరించకుంటే పంచాయతీ ఎన్నికలు తన పాలిట యమ పాశాలు అవుతాయన్నది ఆయన దిగులు. అందుకు ఆయన కనిపెట్టిన తరుణోపాయం - "మాబాబు" సినిమా.

హీరో అర్జున్ నటించిన "ఒకే ఒక్కడు" సినిమా సూపర్ సక్సెస్ కావడం, దానిపై ప్రజలలో చర్చ జరగడం చంద్రబాబు సినిమా ప్రయత్నానికి ప్రేరణ. అందులో అర్జున్ నటించిన ముఖ్యమంత్రి పాత్ర వలె, చంద్రబాబు కూడా ప్రజల మేలు కోసం పని చేస్తున్నాడు అనే అభిప్రాయం కల్పించడం ఈ సినిమా లక్ష్యం.

ఇందుకోసం నిర్మాత, ఎమ్పీ రామానాయుడు ఒక ప్రత్యేక కథ తయారు చేస్తున్నాడు. హీరోగా తన కుమారుడు వెంకటేష్‌ను ఎంపిక చేశాడాయన. హీరోయిన్‌గా సౌందర్య నటిస్తుంది. రాష్ట్ర సమాచార శాఖా మంత్రి శివప్రసాద్ ఈ సినిమా నిర్మాణ బాధ్యత స్వీకరించాడు. మొత్తం నాలుగు కోట్ల ఖర్చుతో సినిమా విడుదల అవుతుందన్నది అంచనా. తెలుగుదేశం నేతలు కొందరు ఒక గ్రూపుగా ఏర్పడి నిధుల దండకం ప్రారంభించారు. ఒకటి రెండు వారాలలో డైరక్టర్ ఎవరన్నది నిర్ణయించి, షూటింగ్ మొదలు పెడతారట.

రాష్ట్రాభివృద్ధికి చంద్రబాబు నాయుడులో గల భవిష్యద్దృష్టి (విజన్); అందుకోసం ఆయన ప్రవేశపెట్టిన వినూత్న కార్యక్రమాలు; జన్మభూమి, స్వర్ణాంధ్ర ప్రదేశ్ పథకాలు; తరచు జరిపే ఆకస్మిక పర్యటనలు, డైల్ యువర్ సిఎం వంటి విశేషాలు; ప్రభుత్వంలో ప్రజలకు భాగస్వామ్యం కల్పించడానికి నీళ్ల సంఘాల వంటి సంస్థల సృష్టి; అవినీతికి పాల్పడే అధికారులపై ముఖ్యమంత్రి ప్రదర్శించే ఆగ్రహం; మంత్రులు, అధికారుల చేత ఆయన పనిచేయించే తీరు వంటివన్నీ ఈ సినిమావుంటాయి. చంద్రబాబు ఒక ముఖ్యమంత్రిగా ప్రజలకు చేస్తున్న సేవ అనుపమానమైందని, ఆయన కేవలం ప్రజల సంక్షేమం కోసం మాత్రమే పరిపాలన చేస్తున్నాడని ఈ సినిమా ద్వారా ప్రేక్షకులకు నమ్మకం కల్గించి, దిగజారి పోతున్న వ్యక్తిగత ప్రతిష్టను పెంచడానికి అవసరమైన మసాలాలన్నీ ఇందులో వుంటాయి. అట్లని, కేవలం రాజకీయాలకు పరిమితం చేస్తే అది డాక్యుమెంటరీ వలె తయారయ్యి, జనం థియేటర్లను రాకుండా పోయే ప్రమాదం వుంది కాబట్టి, సౌందర్య వంటి తారల తళుకుతో శృంగారం, వినోదం వంటి సినీసహజ మసాలాలకు సైతం కథలో స్థానం కల్పిస్తున్నారు.

మార్చి నాటికి షూటింగ్ పూర్తి చేసి, పంచాయతీ ఎన్నికలకు రెండు వారాల ముందుగా దీన్ని విడుదల చేయాలని ఆదేశించాడు చంద్రబాబు. మంత్రి శివప్రసాద్ ఇక నుంచి ఇదే పని మీద వుండాలని కూడా చెప్పాడు.

ప్రతిపక్షాలు ప్రారంభించిన కరెంట్ నిరసన వుద్యమం కేవలం రాజకీయ ప్రయోజనాలకోసం జరిపింది అని; గిట్టుబాటు ధరలు లేకుండా పోవడానికి కారణం కేంద్ర ప్రభుత్వ అసమర్థత తప్ప చంద్రబాబు తప్పు లేదని; రైతుల ఆత్మహత్యలు, కరెంట్ కొరత వంటి ప్రభుత్వ తప్పిదం వల్ల జరుగుతున్నవి కాదని; గతంలో కాంగ్రెస్ ప్రభుత్వాలే అందుకు కారణమని ఈ సినిమా ద్వారా ప్రజలకు అర్థమయ్యేట్లు చూస్తారట.

హైటెక్ సిటీ, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ, ప్రపంచ బ్యాంక్ అప్పులు, బిల్ గేట్స్ సహకారం వంటి వాటి వల్ల రాష్ట్రం ఎట్లా అభివృద్ధి చెందబోతున్నది ఇందులో వివరంగా చూపుతారు.

అయితే, చంద్రబాబు మాత్రం సినిమాలో కన్పించడు. ఒకటి రెండు సన్నివేశాలలో ప్రత్యేకంగా కన్పిస్తే బాగుంటుందని కొందరు సలహా ఇచ్చినప్పటికి చంద్రబాబు అందుకు అంగీకరించలేదు.

**జమీన్‌రైతు చందా**

సంవత్సరానికి రూ.100లు

విదేశాలకు రూ.650లు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 0861-327354. Offset Printing at Zaminryot Press, Nellore.